ఓమ్.

# యదువంశము

(మహాభాగవత కథ)

కవికుమార,

మహావాది వేంకటరత్న

విరచితము.

ప్రకాశకులు.

రామా అండ్ కో., ఏలూరు

ఎడ్యుకేషనల్ పబ్లిషర్సు, బుక్కుసెల్లర్సు.

లలిత ముద్రాక్షరశాల, తెనాలి.

౧౯౨౮.

 అ. 8.

## ఎనిమిదవ ప్రకరణము.



## తొమ్మిదవ ప్రకరణము.



## పదియవ ప్రకరణము.



## ఉపసంహారము.





# విషయసూచిక

## మొదటి ప్రకరణము.



## రెండవ ప్రకరణము.



## మూడవ ప్రకరణము.



## నాలవ ప్రకరణము.



## ఐదవ ప్రకరణము.



## ఆరవ ప్రకరణము.



## ఏడవ ప్రకరణము.



ఓమ్.

శ్రీవిఘ్నేశ్వరాయనమః.

# యదువంశము.

## ౧

పూర్వము నహుషుండను మహీకాంతుఁడు నూఱు యజ్ఞముల నొనర్చి సురలోకాధిపత్యమును బొందెను. కాని కొండొక కారణంబున నగస్త్యమహాముని శాపోపహతుండై యాతండు మానుషరూపంబును గోలుపోయెను. నహుషునకు యతియు, యయాతియు, సంయాతియు, నాయాతియు, వియతియుఁ, గృతియు నను నార్వురు కొమరులుండిరి. తండ్రి యనంతరము పెద్దకుమారుఁడగు యతి రాజ్యమునకువచ్చెను.

యయాతి.

కాని యాతఁడు రాజ్యంబు సకలపాపంబులకు మూలంబనియు, దానివలన దేహికిఁ బునర్జన్మంబు సిద్ధంబనియుఁ దలంచి రాజ్యంబును విడనాఁడి యోగివృత్తి నవలంబించెను. అన్నయుఁ దండ్రియు

నీవిధముగా నగుటవలన యయాతి రాజ్యభారమును వహిం చెను. ఈతఁడు మొదటినుండియు సత్ప్రవర్తనముఁ గలవాఁడు. రాజధర్మమును జక్కఁగా నెఱింగినవాఁడు. ఎల్లప్పుడు వినయ విధేయతలతోఁ బెద్దలయందు వర్తించుచుండెడివాఁడు. ఇట్టి శుభగుణసంపత్సమేతుఁడగు యయాతి రాజ్యమునకు వచ్చి నప్పటినుండియు రాష్ట్రమునఁ గల ప్రజలందఱును సర్వశుభ ములతో విరాజిల్లుచుండిరి.

యయాతి సుక్షత్రియవంశసంజాతుఁడై యున్నను గర్మ వశమున బ్రహ్మవంశసంజనితయగు దేవయానిఁ బరిణయమ య్యెను. దేవయాని, దైత్యగురుండును, క్షత్రియధర్మవిజ్ఞాన పరిపూర్ణుండును, శాపానుగ్రహసమర్థుండును నగు శుక్రాచా ర్యునకు ముద్దుపట్టియై యుండెను. తేజోనిధియగు భార్గవుని పుత్రికయైన దేవయాని, దేవగురుండగు బృహస్పతి కుమారుఁ

దేవయాని.

డైన కచుని శాపంబునఁ జేసి యయాతినిఁ బెండ్లియాడవలసిన దయ్యెను. శుక్రుండును బుత్రికాభిప్రాయానుసారము యయాతికి నామె నిచ్చి వివాహ మొనర్చెను. కాని వివాహసమయమున నగ్నిసాక్షిగాఁ గైకొన్న పత్నితోఁగాక, పరకాంతలతో సంభోగింపకుండునట్లుగను, దేవయానియందే సర్వవిధ కామో పభోగంబులనుభవించునట్లుగను శుక్రుండు యయాతి వలనఁ

ప్రతిజ్ఞ సేయించెను. నాటనుండియు, యయాతి ప్రతిజ్ఞాభంగము వాటిల్లకుండ నేకపత్నీవ్రతమును సలుపుచు, దేవయాని వలన యదువు, తుర్వసుఁడు నను నిరువురు కుమారులఁ బడసి ప్రజారంజకంబుగా రాజ్యపరిపాలన మొనర్చుచుండెను.

దేవయానికి శర్మిష్ఠయను నొక చెలికత్తెయుండెను. ఈమె వృషపర్వుండను దానవేంద్రుని పుత్రిక. కాని తమ గురుపుత్రికయైన దేవయాని నామె యవమానించియుండుట వలన శుక్రుండు వృషపర్వునిపైఁ గోపించి, నిజకుమారికాపరాభవప్రతీకారమునకై యాతని పుత్రికను దేవయానికిఁ బరిచారికగా నొసంగవలయుననియు, లేకున్న శాపబలంబునఁ దానతని వంశచ్ఛేద మొనర్చువాఁడనియుఁ దెలియఁజేయ వృషపర్వుండు భయపడి, తన పుత్రికను బరిచారికా సహితంబుగ దేవయానికిఁ బరిచారికగా నొసంగెను. దేవ

శర్మిష్ఠ.

యాని యయాతినిఁ బెండ్లియాడినప్పటినుండియు శర్మిష్ఠ యామెను గొల్చుచు యయాతి యందు శ్రద్ధానురాగములు గలదైయుండెను. సహజముగ రాజకుమారికయగుటవలన శర్మిష్ఠ దేవయానికంటెను జక్కనిదై యుండెను. చక్కదనమునకుఁ బరిపూర్ణమైన యౌవనముతోడైయుండెను. ఇట్లుండఁగా నొకనాఁడు దేవయాని లేని సమయముఁ గనిపెట్టి శర్మిష్ఠ యయాతికిఁ దన చిత్తము నెఱిఁ

గించెను. అతఁడును నామె మనోహర రూపలావణ్యాతిశయం బులకు లోఁబడి, తాను గైకొన్న ప్రతిజ్ఞను మఱచి నాట నుండి యామెతో రహస్యసంభోగమున మెలఁగఁజొచ్చెను. కాలవశంబునఁ గ్రమముగా శర్మిష్ఠ గర్భంబును ధరించి ద్రుహ్యుండు, ననువుఁ బూరువు నను ముగ్గురు తనయులఁ గాంచెను. అప్పుడు దేవయానికిఁ గలరూపు సర్వముఁ దెలిసి పోయెను.

యయాతి సమయభంగ మొనర్చినందుకై దేవయాని మిక్కిలి కోపించి, నాథుఁడు తన్నెంత ప్రతిమాలినను వినక తండ్రియైన శుక్రాచార్యునకు సర్వమును దెలియఁజేసెను. శుక్రుండు నాతని ప్రతిజ్ఞాభంగమునకు సహింపఁజాలక "నేటి నుండి ముదిమి నిన్నలముకొనుఁగాక" యని యయాతిని శపిం చెను. భార్గవశాపోపహతుండైన యయాతి కరుణింపవేయని శుక్రుని పాదంబులపైఁబడ నాతండును గొంత దయఁగలవాఁడై యతని కుమారులలో నెవ్వరికైనను, దన ముదిమి నొసంగి, యట్టివాని యౌవనమును నతండుగైకొని సుఖింపవచ్చుననియు విషయేచ్ఛాసక్తి నశించిన యనంతరము తిరిగి యతని ముదిమిని నాతఁడు గైకొని, కుమారుని యౌవనమును గుమారునకొసంగవచ్చు ననియుఁ దెలి యఁజెప్పెను. శుక్రుని వాక్యానుసారము

భార్గవ శాపము.

యయాతి కుమారుల నందఱిని రావించి నిజ జరాభారమును వహింపుఁడని కోరఁగా యదువు మొదలగువారెవ్వరును నంగీకరింపకుండిరి. కాని శర్మిష్ఠ కనిష్ఠకుమారుఁడైన పూరువు మాత్రము తండ్రి కోరిన ప్రకార మాతని ముదిమినిఁ దాను గైకొని, తన యౌవనమును నాతని కొసంగెను. అప్పుడు చిన్నకుమారుని పితృభక్తికి యయాతి సంతసపడి యదువు మొదలగు తక్కిన కుమారులను రాజ్యభ్రష్టులగుదురనియు, వారియందు సుక్షత్రియత్వము నశించుననియు, యదు సంతతి వారందఱును క్షత్రియులుగాఁ బరిగణింపఁబడరనియుఁ దుర్వసు వంశంబువారు ధర్మాధర్మ వివేకశూన్యులగు కిరాతులకు రాజులగుదురనియు, ద్రుహ్యావంశంబువారు దుష్ప్లవసంతార్యంబైన దేశంబులకుఁ బాలకు లగుదురనియు, ననువు వంశంబువారు ముదిమి దొఱంకొనునంతవఱకు జీవింపక యౌవనంబుననే యకాల మరణంబునకు లోనగుదురనియు నీవిధముగా శపించి యంతంబునఁ బూరువునకు రాజ్యంబొసంగి, తన ముదిమిఁ దాను గైకొని తపోవృత్తి నవలంబించెను.

యయాతి కుమారులను శపించుట.

యయాతి పెద్దకుమారుండగు యదువు వంశంబు వారందఱును, శాపగ్రస్తులగుటవలనఁ దమ క్షత్రియత్వంబును గోలుపోయి నాటనుండి యాదవు లనఁ బరగుచు

యదు వంశము.

గోరక్షణతత్పరులై మెలంగఁజొచ్చిరి. కానివీరి యందును శూరులైనవారు రాజ్యములను స్థాపించి ప్రజాపాలన మొనర్చియుండిరి. కాని సుక్షత్రియత్వమును గోలుపోయినవారగుటవలన క్షత్రియు లెవ్వరును దమతో సమానులుగా యాదవులను గైకొన కుండిరి. ఇట్టి యదువంశమునకే భగవంతుఁడైన శ్రీకృష్ణుఁడు సంబంధించియుండెను.

# ౨

యదువంశోద్భవుఁడగు శూరుఁడను ధారుణీనాథునకు మారీష యను కాంతారత్నమునందు వసుదేవుం డుదయించెను. వసుదేవుఁడు పుట్టిన వెంటనే యనిమిత్తముగ నెల్లెడల శుభసూచకంబులు పెక్కులు గానంబడెను. ఇతఁడు సామాన్యమైన మానవజన్మమును ధరించినవాఁడుగాఁడు. తొలుఁదొల్త నీతండు సుతపుండను ప్రజాపతియై యుండెను. అట్టి

వసుదేవుని జన్మక్రమము.

యెడ ననపత్యతవలన శ్రీహరిఁ గూర్చి యితండు పెక్కు సంవత్సరములు తపంబొనర్ప హరియుఁ గరుణించి ప్రత్యక్షమై యేమి కావలయునో కోరుకొమ్మని పలుకఁ బుత్రానురాగంబు పెంపున నక్షరంబగు మోక్షంబును నాకాంక్షింపక సుతభిక్షకై యామహామహునిఁ బ్రార్థించెను. శ్రీహరియు నాతని గుణశీలాదులకు మెచ్చినవాఁడై తానే యాతనికి మూఁడుజన్మంబులయందుఁ బుత్రుండై పుట్టువాఁడని తెలియంజెప్పి యదృశ్యుండయ్యెను. అదే ప్రకారము మొదటిజన్మంబునఁ బృశ్నిగర్భుండను నర్భకుండుగను, రెండవ జన్మంబున నాతండు కశ్యపప్రజాపతియై యుండఁ దాను వామనుండుగను శ్రీహరి పుత్త్రుఁడై యాతనిక జన్మించియుండెను. మూఁడవజన్మంబున నీతఁడు వసుదేవుండను పేరునఁ బుట్టియుండ శ్రీహరియు నాతనికిఁ గృష్ణుండను పేరున

నుద్భవించి యిలాభారంబు బాపనుండెను. భగవంతుఁ డీత నికిఁ బుత్రుఁడై జన్మింపనుండెననియే వసుదేవుఁడు పుట్టినప్పు డనిమిత్తముగఁ బెక్కు శుభసూచకములు గానవచ్చెను.

వసుదేవుఁడు యుక్తవయస్సునందే రాజ్యభారంబును వహించి పెండ్లియాడున దేవకీదేవి యనుకన్యను భార్యఁగాఁ గైకొనెను. దేవకీదేవి దేవకుండను వానిపుత్రిక. దేవకుఁడు దానవనాథుఁడైన యుగ్రసేనునకు సహోదరుఁడు. ఉగ్రసేనునకుఁ గంసుఁడను కుమారుఁడొకండు గలఁడు. కంసుఁడు దేవకినిఁ దోఁబుట్టి దానిఁగాఁ బ్రేమించుచుండెడివాఁడు. వసుదేవునకీమె మొదటిజన్మంబునఁ బృశ్నియను పేరునను. రెండవజన్మంబున నదితియను పేరునను, నిప్పుడు దేవకీదేవియను పేరునను బత్నియయ్యెను. గతజన్మద్వయంబునందీమె శ్రీహరినిఁ బుత్రునిఁగాఁ బడిసియుండెను. వసుదేవుండును బూర్వజన్మంబుల నీమె తనయెడలఁ జూపిన పతిభక్తి విశేషంబులకునలరి. మూడవ జన్మంబునను, నీమెయేతనకు సతికావలయునని నోచినవాఁ డగుటవలన నాప్రకారమే దేవకీదేవి యాతనికిఁబత్నియయ్యెను. ఈ దేవకీవసుదేవులే యదువంశమునకు ముఖ్యులైయుండిరి.

దేవకీదేవి జన్మక్రమము.

దేవకీదేవియందు మిక్కిలి మక్కువఁగల వాఁడగుట వలన నామె వివాహానంతరమునఁ జెల్లెలిని, మఱఁదిని, దగిన

విధంబున నరదంబునవిడి కొని కంసుఁడు కొనిపోవుచుండెను. కంసునియందాత్మజమువలన దుష్టబుద్ధి యనునది యొంత మాత్రమును లేదు. అతఁడు పుట్టుకవలన రక్కసుఁడేగాని వర్తనంబువలన రక్కసుఁడుగాఁడు. అట్టి సాధుస్వభావముఁ గలవాఁడగుటవలననే. యొంతమాత్రమును గుటిలస్వాంతుఁడు గాక, తన చెలియలిని, బావను, సురక్షితముగాఁ గొనిపోవుచుండెను. కాని విధిమాత్రము కంసునకుఁ బ్రతికూలముగా నుండెను. ఆతఁడట్లు సంతోషపారవశ్యంబున నొడలెఱుంగక యరదంబును నడపుచుండ నశరీరవాణి యాతని సంబోధించి—'కంసా'

అశరీరవాణి పలుకు.

కం॥ దుష్టయగు భగినిమెచ్చఁగ
నిష్టుఁడవై రథము గడపె • దెలుఁగవుమీదన్
శిష్టయగు నీతలోదరి
యష్టమగర్భంబునిన్ను • హరియించుఁజుమీ!

అనిపలికెను.

అట్లశరీరవాణిపలికిన పలుకులు చెవులకు ములుకులై సోకఁ దోకఁద్రొక్కిన త్రాచువలె బుసఁగొట్టుచు దిగ్గన నరదంబు డిగ్గనుఱికి, నిజప్రాణరక్షణపరాయణుండై, చెల్లెలినిఁ గొప్పువట్టి పుడమికీడ్చి, యామెప్రాణంబులఁ గొనుటకై తన నిశితకరవాలమును బైకెత్తెను. ఆహా! స్వార్థపరాయణత్వ మెంతనీచమైనది? ఏకగర్భసంజనితులకుఁగూడ నొకానొక

ప్పుడు విరోధంబును బెంపొందించునుగదా? నిజప్రాణరక్షణో ద్యోగాసక్తసహోదరీ ప్రాణాపహరణ ప్రయత్నంబుననున్న కంసునిం గాంచి వసుదేవుండు భయపడినవాఁడై తేరు డిగ్గి యాతనిని సమీపించి ' బావా! ఇదేమియాగడము? ఎన్నఁడో యాపద వచ్చునని యశరీరవాణి పల్కుచ్చినంతమాత్రమున నీయట్టి శూరుఁడు భయపడుటయేగాక మిూమిక్కిలి ప్రేమా స్పదురాలగు చెలియలిని— నూతనపాణిగ్రహణోత్సవానంద తత్పరయగు చెలియలిని— సంసారసుఖభోగానుభవవాంఛా పరిపూర్ణమనస్కయగు చెలియలిని— ఈవిధముగా— ఇంత దయాశూన్యముగా వధింపఁదలంచుట యా? కంసా! సహో దరియందు నీకుఁగల ప్రేమయంతయు నశించి

వసుదేవుని మొఱ. నదా? నీచెలియలి ప్రాణము మాత్రము నీ ప్రాణమువంటిది కాదా? పురుషుఁడవైన నీవే ప్రాణరక్షణోపాయము నెఱుఁగఁజాలక సోదరిసిఁ జంపఁ దండ నాడుది యగు నీ తోఁబుట్టువేమి చేయఁగలదు? ఇదియేనా పౌరుషధర్మము? అదిగాక—

ఉ. అన్నవు నీవు చెల్లెలికి • నక్కట మాడలు సీర లిచ్చుటో
మన్నన సేయుటో మధుర • మంజులభాషల నాదరించుటో
మిన్నుల మ్రోఁతలే నిజము • మేలని చంపఁగ మన్న మాని రా
వన్న సహింపుమన్న తగ • దన్న వధింపఁగ మన్న వేఁడెదన్.

అని వసుదేవుఁడు దేవకీదేవి ప్రాణములనురక్షించుటకై కంసుని

ననేక విధములఁ బ్రార్థించెను. కాని యాపాపుని మనస్సు కరుగలేదు. ఆతని నిశ్చయము మారలేదు.

వసుదేవుఁడు తన ప్రార్థనము కంసునియెడ నిష్ఫలమై పోవుటఁగాంచి నిజసతీమణికి ముప్పు దప్పదని తలంచియుఁ గొంత ధైర్య మవలంబించి 'కానిమ్ము. ఈతలోదరి యష్టమ గర్భంబుగదా కంసుని ప్రాణముల హరించునదియని యాకాశ వాణి తెల్పినది. అట్టియెడ నిప్పుడు నిష్కారణముగాఁ గాంతను గోలుపోవుటేల? ఈమెకుఁ గలుగు శిశువుల నందఱిని నీతనికే యర్పించెదను. మీఁద దేవుఁడే గలఁడు. ఈత డెంత యత్నించినను దైవవిధి తప్పునుగదా? కానిమ్ము. చూతము, అని తనలోఁ దాను సమాధానమును బొందినవాఁడై కంసునిఁగాంచి 'కంసా! నీసోదరిని నిష్కారణముగా నేలచంపెదవు? ఈమెకుఁ బుట్టువారలుగదా నిన్ను సంహరించునది? దానికై నీవెంత మాత్రమును భయపడ నక్కఱలేదు. ఈమెకుఁగలుగు శిశువుల నందఱినిఁ బుట్టినతోడనే నీకప్పగించెదను. ఆశిశువులనే సను యించి నీప్రాణములనుగాపాడుకొనుము' అని తెలియఁజెప్పెను.

వసుదేవుని మహాధైర్యము.

వసుదేవుఁడట్లు తనకుఁ దెలియఁజెప్పఁగనే కంసుఁడును గొంతవఱ కాలోచించి యదియేసమ్మతమని తలంచినవాఁడై 'బావా! నీపలుకులను శిరసావహించెదను. ఆడినమాటను

దప్పక యీయామెకుఁగలుగు శిశువులను నాకప్పగింప వలయును సుమా! మాటఁ దప్పినయెడల మీయిర్వుర

కారాగృహవాసము.

ప్రాణంబులును దప్పిపోవును. ఈకంసుఁడెంత మాత్రమును దయఁజూపు వాఁడుగాఁడు' అని తనమనోనిశ్చయమును వసుదేవునకుఁ దెలియపరచి యాక్షణముననే వారలనిద్దఱిఁగొని తనపురంబునకరిగెను. పురమును బ్రవేశించిన వెంటనే కంసుఁడు వసుదేవుని మాటయందు నమ్మకములేనివాఁడై చెలియలిని, మఱఁదిని, శృంఖలాబద్ధులుగ నొనర్చి కారాగృహము నందుంచెను. అప్పటికిని నిండార నమ్మకములేనివాఁడై శిశువు పుట్టినతోడనే తనకుఁ దెలియజేయవలసినదని తనకాపులైనవారినిఁగొందఱినిఁ గాపు వెట్టెను.

దేవకీ వసుదేవులట్లు కంసునివలనఁ గారాగృహవాస మొనర్చుచు సంతతము భగవచ్చింతన సేయుచుఁ గాలమును గడుపుచుండిరి. ఇట్లుదినములు గతించినకొలంది, దేవకీదేవి క్రమక్రమముగా గర్భమును ధరింపసాగెను.

సత్యవాక్య పరిపాలనము.

వసుదేవుండును సత్యవ్రతాచరణ తత్పరుండగుటవలన గర్భోత్పత్తియైనవెంటనే పుత్రానురాగమునుగూడ లెక్కింపక యాపొత్తుల కందువులను గంసునకర్పించు చుండెను. అతండును దయాశూన్యుఁడై

యాపసిపాపలను దననిశిత కరవాలమున కెరఁజేయుచు నశరీర వాణిపలుకులు దనయెడల నెట్లు సార్థకంబులగుననియు, దైవ విధి తనకెట్లు ప్రతికూలము కాఁగలదనియుఁ దనకుఁదాను సమాధానము సెప్పికొనుచు నిజ సహోదరి యష్టమ గర్భంబువలనఁ దనకెంతమాత్రమును బ్రాణహాని సంభవింప నేరదను నమ్మకముతోనుండెను. వసుదేవుండును బుట్టినవారు పుట్టినట్లే గిట్టుచుండినను, దుఃఖములపాలుగాక, సంతతము శ్రీహరిచింతనంబును దవిలియుండెను. దేవకీదేవియుఁ బురా కృత కర్మఫలంబు ననుభవింపక తీరదను నిశ్చయంబునఁ బుత్ర శోకమును దిగమ్రింగుచు దైవమునే నమ్మియుండెను. ఆప దలు ముమ్మరంబుగఁ జుట్టుముట్టిన ముట్టుగాక! ధీరస్వభావ మెంతమాత్రమును జలింపనేరదు. పౌరుషంబు దైవంబును దప్పింపఁజాలదు.



# 3

దేవకీదేవి యేడవగర్భంబును దాల్చినవెంటనే విశ్వరూపుండైన హరి గర్భస్థుఁడగు జీవునకుఁ గంసునివలన హాని సంభవించునని యెఱింగి, తన్ను నమ్మియున్న యాదవులకు మేలొనర్పఁదలంచినవాఁడై యోగమాయాదేవినిఁ జేరంబిలిచి 'దేవీ! వసుదేవుని భార్యలలో నొకతెయైన రోహిణియను కాంత కంసునివలన నెట్టియాపదనుబొందక నందగోకులమున సురక్షితముగానున్నయది. ప్రస్తుతము దేవకీదేవి గర్భస్థమైయున్నపిండ మాదిశేషునియంశమున వృద్ధిఁబొందుచున్నయది. కావున నీ నేర్పుకొలంది ప్రయత్నించి యాపిండమును గొని రోహిణీదేవి గర్భమునఁ జొనిపిరమ్ము. అష్టమ గర్భంబున నేనామెకుఁ బుత్రుఁడనై పుట్టెదను. నీవును యశోద యను పొలతికిఁ బుత్రికవైపుట్టుము. జనులందఱును నిన్ననేక విధంబుల ననేకనామంబులతోఁ బూజింపఁగలరు' అని చెప్పి పనిచిన వెంటనే మాయాదేవియుఁ దన యోగమాయవలన నెవ్వరికిఁ దెలియనిచందమున దేవకీదేవి గర్భస్థమగు పిండమును గొని రోహిణీదేవి గర్భమున నుంచెను. అంత రోహిణియు గర్భంబును దాల్చినదై యొక్క కుమారునిఁ గనెను. ఆపసిపాపఁడు, బలముఁగలవాఁడగుటవలన, బలభద్రుఁడనియు,

బలరాముని జననము.

లోకరమణుఁడగుటవలన, రాముఁడనియు, గర్భ సంకర్షణమున సంకర్షణుఁడనియు, మున్నగు నామములతోఁ దేజరిల్లఁ జొచ్చెను. ఈవిధముగాఁ గృష్ణావతారమునకు ముందే నందగోకులమున బలరామోత్పత్తి యయ్యెను. మాయాదేవియు శ్రీహరి వాక్యానుసారము యశోదగర్భమును జొచ్చెను.

దేవకీదేవి యేడవ గర్భమేమైనది యెవ్వరికిఁ దెలియకున్నందువలనఁ బౌరులందఱును గడుపుదిగెనని యనుకొనసాగిరి. ఇట్లు కొన్నిదినములు గడచునప్పటికి, దేవకీదేవి యష్టమ గర్భంబును ధరించెను. ఈయష్టమ గర్భమేగదా తన్ను సంహరించునదియని కంసుఁడు గడు జాగరూకతతోఁ దనవారిచేఁ గాపుంచెను. పాపము! వసుదేవునకుఁ బుత్రు నెట్లు గాపాడవలయునో తెలియకుండెను. భారమంతయును భగవంతునియందే నిలిపి యాతని చరణసరసీజములే తమకు దిక్కనినమ్మి యారాధించుచు నాదంపతులు దినములు గడపుచుండ నొకనాటిరాత్రి శ్రీహరి వసుదేవునకుఁ బ్రత్యక్షమై తన్నేమార్గమునఁ గాపాడ వలసినదియుఁ దెలియఁజేసి యదృశ్యుండయ్యెను.

శ్రీకృష్ణుని జననము.

అప్పటికే దేవకీదేవికి నీళ్ళాడు ప్రొద్దులగుటవలన నొకనాటి నడురేయిని, దారలు, గ్రహంబులు మొదలగునవియన్నియును శుభగతిని నుండ నామెయొక్క శిశువును గనెను. పిండోత్పత్తి

యైన వెంటనే యొరులకుఁ దెలియకుండఁ బూలవానలు గురిసెను. దేవదుంధుభులు మ్రోగెను. సురకాంతల నృత్యగీతములు విజృంభించెను. మఱియొకదెస, బ్రహ్మాదిసకలదేవతలును నారదాది సర్వమునీంద్రులును, కైలాసాది సకలభువనంబులును, నాతనిఁ గీర్తింపఁ దొడంగ్గిరి. ఆహా! ఏమి యా పాపని సౌదర్యము? దేహము నీలవర్ణము. కన్నులు పద్మములు. కంఠహారము కౌస్తుభము. మోము పూర్ణేందు బింబము. అవియివి యననేల? సర్వవిధముల శ్రీహరినిఁ బోలియుండెను. ఆ పాపని తేజఃపుంజమునలన నా పురిటియిల్లు చక్కఁగాఁ బ్రకాశింపఁ జొచ్చెను. అట్టి శిశువును వసుదేవుఁడు గాంచి శ్రీహరియే తనకుఁ బుత్రుఁడయ్యెనని తలంచి, పుత్రానురాగమును బొందక, కేవలము భక్తిపరవశుఁడై యాపాపనికిఁ బ్రదక్షిణపూర్వక నమస్కారం బొనర్చి, ముకుళిత కరకమలుండై "దేవా! సర్వమును నీయందిమిడియున్నది. నిజముగ నీవు సర్వాత్ముఁడవు. సర్వమయుఁడవు. సర్వేశ్వరుఁడవు. గుణవికార రూపరహితుండవు. జనన మరణాదులు నీకుఁ గలుగనేరవు. నీవే పరబ్రహ్మవు. నీయాజ్ఞలేనిదే తృణమైనను గదలఁ జాలదు. భూభారమును దొలంగించుటకై నీవిట్లు రూపంబునుగొని యుద్భవించితివేగాని, నీకు రూపోత్పత్తులు గలవా?' యని యిట్లనేకవిధంబులఁ బ్రార్థింపఁ దొడంగెను.

దేవకీదేవియుఁ బుత్రవ్యామోహంబును బొందక, పరబ్రహ్మ స్వరూపంబైన యాశిశువును బలువిధంబుల నుతిసేయసాగెను. ఈవిధముగా సకలమునకు శ్రీహరిజన్మక్రమము తెలిసియుండ, మాయాదేవి యోగనిద్రవలన రక్కసకులంబున కెంతమాత్ర మును దెలియకుండెను. ఆహా! పరాత్పరుని తత్త్వంబు నెవ్వరు గుర్తింపఁగలరు ?

వసుదేవుఁడు పుత్రి రక్షణము తనకుఁ గర్తవ్యమై యుండుటవలన భక్త్యావేశము నణంచుకొని, రక్షణోపాయ మును, హరివలన నింతకుమున్నే యెఱింగి యున్నవాఁడగుట వలన, నాపసిబిడ్డను జంకనిడుకొని గోకులమునకు బయలు దేరెను. యోగనిద్రవలనఁ గావలివారలా సమయంబున శరీ రంబులు మైమఱచియుండిరి. వసుదేవున కప్రయత్నముగా నినుపసంకెలలూడిపోయెను. అప్పుడాతండు సవ్వడిగాకుండ మెల్లన నడుగులిడుచు మొగసాలలంగడచి యచిరకాలంబుననే పురంబును నిర్గమించి యమునానదీ సికతా తలంబును సమీపించెను. అచ్చోట యము నయు మురళీగానముచేత ముందు తన్నాబిడ్డ మోహింపఁజేయనుండెనని మేలుదలంచెనో యనునట్లు వసు దేవునకు మార్గమునొసంగెను. ఆతండును, ననాయాసముగా నదినిదాటి వ్రేపల్లెకుంజని యచ్చ నందునినుందిరంబు ను నుం

కృష్ణుఁడు గోకులమును జేరుట.

దుగఁ జొచ్చి యందమందనిద్రం బొందియున్న యశోదను డాయంజని, యామెకుఁ దెలియకుండ నప్పుడే పుత్త్రికారూపం బునఁ బుట్టియున్న మాయాదేవినిఁ దానుగైకొని యాయవ్వ శయ్యపైఁ దనపసిగందును బరుండఁబెట్టి మరల నింటికిబయలు దేరెను. ఈవృత్తాంతమంతయు నెవుల కెంతమాత్రమును దెలియకుండెను. వసుదేవుండట్లు బయలుదేరి యథాప్రకార ముగా నదినిదాటి కారాగృహంబునుజొచ్చి యా యాఁడుశిశు వును దనకాంతకొసంగెను.

పసిపాపయైన మాయాదేవిని, నత్తెఱంగునఁ గొనివచ్చి వసుదేవుండు నిజసతీమణి పురిటి మంచముపై నుంచినంతనే యాబాలిక, రక్కసకులమును మేల్కొలుపుటకో యనునట్లు యేడువఁదొడంగెను. ఆరోదనధ్వనుల నాలకించి కావలి వారలు మేల్కాంచి సర్వము నెప్పటివిధమున నుండుటఁగని హానియేమియుఁ గలుగలేదను నమ్మకముఁ గలవారై, శిశువు కలిగిన సమాచారము నప్పుడే కంసునకుఁ దెలియఁజేసిరి. ఆతఁడు, నీయష్టమగర్భంబేగదా తన్ను సమయించునది యని రోషకషాయితనేత్రుండై దిగ్గన శయ్యనుండి డిగ్గి, వెండ్రుకలు ముడివీడఁ దాల్మినశింపఁ బైచీరతొలఁగిపోవఁ

మాయాదేవి

దత్తరంబునఁ బురిటి గృహంబును జొచ్చి, యేడ్చుచున్న యాపసిగందును దన నిశిత కర వాలంబున కెరఁజేయుటకై, చేపట్టి భయంకరమైన యావాడి

వాలును బైకెత్తెను. అట్టియెడ దేవకీదేవి పెద్దపెట్టున నేడ్చుచు నాతని కడ్డంబువచ్చి 'అన్నా! అష్టమ గర్భంబునఁగలుగు పుత్రుండుగదా నీప్రాణంబులఁగొనునని యాకాశవాణి పల్కినది? నాయష్టమగర్భంబు బాలికగాని బాలుండుగాడు. ఈ యాడుబిడ్డవలన నీకేమిభయము? దీనిని విడిచిపెట్టుము. అయ్యో! ఇదివఱకే నాకుఁగలిగిన యార్గురుకొడుకులను బట్టి దయాశూన్యుండవై వధించితివి. ఇప్పుడీ యాడుబిడ్డనుగూడ నిష్కారణముగా వధింపనుంటివి. నాకుఁ బుత్రలాభము లేక పోయినను, బుత్రికాలాభమునైనఁ బొందనిమ్ము. అన్నా! ఈ యాడుబిడ్డ నిన్నేమిచేయఁగలదని భయపడెదవు? ఇదియేనా నీకుఁగలపౌరుషము?

ఉ॥ అన్న క్షమింపుమన్న తగ • దల్లుఁడుగాఁడిది మేనకోడలా
మన్ననసేయుమన్న విను • మానినిఁ జంపుట రాచపాడిగా
దన్న సుకీర్తివై మనఁగ • దన్న మహాత్ములు వోవుత్రోవఁబో
వన్న భవత్సహోదరిఁగ • దన్న నినుఞ్ శరణంబువేడెదఞ్.

అని యీవిధముగా ననేకవిధంబుల నాతనిఁ బ్రార్థింపఁ జొచ్చెను. కాని యామె ప్రార్థనంబువలన నాతని కఠిన హృదయ మెంతమాత్రమును గరుగలేదు. ఆతని నిశ్చితాభిప్రాయ మణుమాత్రమైనను మారలేదు. బలవంతముగా నా శిశుహంతకుఁడు—ఆదుర్మార్గుఁడు—ఆకఠినహృదయుఁడు—

ఆపసిపాపను దల్లిఱొమ్మునుండి గైకొని వెక్కి వెక్కి యేడ్చు చున్నను దయలేనివాఁడై పుడమిపయిం బడవైచెను కాని యాపసిపాప పుడమిపయిం బడక, విచిత్రగతి గగనంబున కెగసి విశ్వరూపంబును దాల్చినదై, చూచువారలాశ్చర్యపడ నందఱును వినునట్లు 'కంసా! నీవెంత యత్నించినను దైవవిధిని దప్పించుకొనఁజాలవు. నిన్ను సమయించువాఁడిదివఱకే పుట్టి పెరుగుచున్నవాఁడు. క్రూరకర్మమని యెంచక సోదరి బిడ్డల నార్గురినిఁ జంపిన పాపమునిన్ను గట్టికుడుపక మానునే?' యని పలుకుచు నంతరిక్షంబున నదృశ్యయై పోయెను. కంసుఁడు హతాశుఁడై పోయెను. అచ్చటనున్నవారందఱును విభ్రమచేతస్కులై యుండిరి.

మాయాదేవి పలికినపలుకులు చెవులకు ములుకులై సోక కంసుఁడు గొంతవడికిఁ దెప్పరిల్లి తానొనర్చినదంతయు నిష్ఫలమైపోయెఁ గదాయని విరక్తిభావముఁగలవాఁడై మహిందియైన వసుదేవునిఁ గాంచిఁ "మహాత్మా! నేను నీయెడ మహాపరాధమును గావించితిని. నేను గేవలము పాపుఁడను. బాలఘాతుకుఁడను. క్రూరుఁడను. దుష్టచిత్తుఁడను. దయాశూన్యుఁడను. బ్రాహ్మణహింసాపరాయణుండను. పాపమనక యశాశ్వతంబగు నీశరీర రక్షణార్థమై నీ యార్గురు కొమరులను బట్టి వధించితిని. అయినను దైవవిధినిఁ దప్పించు కొనఁజాలనైతిని.

ప్రాణులందఱును దమపూర్వజన్మ కర్మానుసారము వృద్ధిక్షయములకును, జననమరణంబులకును లోనగుచున్నారు, దేహధారులెంతయును స్వతంత్రులుగారు రక్షించుటకును శిక్షించుటకును గర్మప్రధాన మగుచున్నది కాని వ్యక్తిప్రధాన మగుట లేదు. మీశిశుసంహారమునకు వారివారికర్మయే ప్రధానంబు గాని నేనెంతమాత్రమును గర్తనుగాజాలను.

దేవకీవసుదేవుల చెఱవిముక్తి.

ఆత్మకెన్నండును ఖగసిలుములు లేవు. అవి కర్మ వలననే కలుగుచున్నవి. ఈతాత్పర్యంబును గుర్తెఱింగి నన్నుక్షమింపవలసినది" యని యాతఁడు పాదములపై వ్రాల వసుదేవుండును గంసుని మనఃపూర్వకముగా క్షమించెను. కంసుండును దేవకీవసుదేవులను జెఱనుండి విముక్తులఁ జేసి తాను నిజమందిరంబున కరిగెను. దేవకీ వసుదేవులును శాంతచిత్తులైయుండిరి.



# ౪

శ్రీకృష్ణుఁడట్లు కారాగృహంబున జన్మంబు నొంది, తండ్రియగు వసుదేవునివలన నందగోకులమునకుఁ జేర్పఁబడి యశోదకుఁ జంటిబిడ్డఁడై దినదినాభివృద్ధిఁ గాంచుచుండెను. నందయశోదలకుఁ గృష్ణుండు పెంపుడుబిడ్డఁడగుటకుఁగారణము లేక పోలేదు. నందుఁడు పూర్వజన్మంబున ద్రోణుఁడను వసువైయుండెను. ఆతనిభార్యపేరుధర. కొండొక కారణంబున బ్రహ్మదేవుఁడు వారలపైగినిసి మర్త్యయోనిఁ బుట్టుఁడని శపించెను. అప్పుడు ద్రోణుండును, నాతని భార్యయగు ధరయుఁ దమకు విష్ణుసేవారతిఁ జేకూర్పవేయుని యావేల్పు పెద్దను బ్రార్థింపఁగా నాతండును నట్లకాకయని వారలకు వరంబొసంగెను. శాపోపహతులైన యాదంపతులు మానవజన్మంబున నందయశోదలనఁ బుట్టియుండిరి. విష్ణుండును గమలాసనుని వరంబును సార్థకముగా నొనర్ప నందయశోదలకు ముద్దుబిడ్డఁడై తన్ను సేవించు భాగ్యమును వారలకు సమకూర్చెను.

నందయశోదల పూర్వజన్మవృత్తాంతము.

కృష్ణుండీవిధమున గోకులమున యశోద ఱొమ్మునఁ బెంపొందుచుండ నచ్చోట మధురాపురంబునఁ గంసునకు నాడునాఁటికిఁ గృష్ణునిపైఁ గల శత్రుత్వము పెంపొందు

చుండెను. తొలుఁదొల్తనశరీరవాణివాక్యము లాతని కర్ణ రంధ్రంబులఁ జొచ్చినప్పుడే కంసునిహృదయమున దుష్టస్వభావముతాండవింపఁ జొచ్చెను. అదియట్లుండ మాయాదేవి వాక్యంబులను వినినప్పటినుండియు నాతనియెడఁ దాండవించుచున్న వైరభావము గజ్జెగట్టి నృత్యముసేయ నారంభించెను.

కంసుని క్రూరస్వభావము.

ఇట్లు కృష్ణునియందుఁ బ్రబల శత్రుత్వమును వహించి యాతనిని రూపుమాపుటెట్లాయని పలుతెఱంగుల నాలోచించుచుఁ గంసుఁడొకనాఁడు తనమంత్రుల రావించి కృష్ణునిఁగూర్చి తనకుఁగల మనస్తాపంబునంతయు వారలకుఁ దెలియఁజేసెను. వారును గొంతవడి దీర్ఘాలోచనమొనర్చి, 'దానవనాథా! శ్రీకృష్ణునకు గోబ్రాహ్మణ సాధుజన సంఘంబులును, నధ్వరమంటప తపోవన శ్రద్ధాశాలలును, మొదలుగాఁ గలవన్నియుఁ బ్రియంబులైయుండును. కావుననట్టివాని నన్నిఁటినిఁ జెఱుపనిప్పుడే యనుజ్ఞనొసంగుఁడు. దానివలనఁ గృష్ణునిపై దమకుఁగల విరోధానలంబు కొంతవఱకుఁ జల్లారఁగల' దని వాక్రువ్వఁ గంసుండును వల్లెయని సాధుల బాధించుటకప్పుడే దైత్య వీరుల కాజ్ఞనొసంగెను. నాటఁగోలెఁ గంసుని దుష్కృత్యములు భూనభోంతరాళంబులందు నిండి ప్రతిబింబింప సాగెను.

ఇట్లు కంసుఁడు నిజభటులను దుష్కృత్యంబు లొనర్పఁ బ్రేరేపించుటయేగాక, తనకుఁదానయే శ్రీకృష్ణ వధోపాయమునుగూర్చి రేయింబవలు విచారింపఁ దొడంగెను. శ్రీకృష్ణుఁడు శిశువై యుండుటవలన లోకంబునఁగల శిశువుల నందఱిని సంహరించినచోఁ గృష్ణుండును సంహరింపఁ బడునుగదా యని తలఁచి తత్కార్య నిర్వాహణమునకై యారక్కసజేటి పూతనయను నొక్క రాక్షసాంగనను నియోగించెను. ఆరక్కసియుఁ గంసుని పంపునఁ గామరూపంబుతో నెల్లెడల సంచరించుచుఁ జనుమొనల విషంబు నిడికొని కనఁబడిన చిన్నిపాపల కందఱికిఁ బాలిచ్చుదానివలెఁ జన్నుగుడుపుచు శిశుసంహార మొనర్పసాగెను. ఇట్లా పూతన వాడ వాడలఁ దిరుగుచుఁ దుదకు గోకులమునకు వచ్చి చేరెను. గోకులమును బ్రవేశించినది మొదలారక్కసి ప్రతిగృహంబును బ్రవేశించి తానువచ్చిన కార్యమును ముగించుకొనుచుండెను. తుదకుఁ గర్మపరిపాకమగుటవలన దానవమృత్యుదేవతాగృహమనఁదగు యశోదాదేవి మందిరంబునుజొచ్చి, పూతన, పాన్పుపైఁ బవళించియున్న బాలకృష్ణునిఁగాంచి చన్నిచ్చుదానివలె నాతనిఁ గైకొనెను. గోపికలందఱును, గామరూపిణియగు పూతన సౌందర్యాతిశయంబుల కచ్చెరువొందుచుఁ గలరూపెఱుఁగఁజాలక

పూతన వధ

మిన్నకుండిరి. పూతన, తనకుఁ జన్నిచ్చుటకుఁ బ్రారంభించి నంతనే సర్వవిదుండైన శ్రీకృష్ణపరమాత్మ యాదానవాంగన దుష్కార్యాచరణమును గుర్తెఱింగి, పాలు ద్రావుచున్నట్లు నటించుచు, గ్రుక్క గ్రుక్కకు నారక్కసిమేనిలోని సత్వమెల్లను ద్రావఁజొచ్చెను. ఆబాలుని యమానుషచర్య కాశ్చర్యపడి, క్షణక్షణమునకుఁ బ్రాణంబులు సన్నగిలుచుండ నిలువఁజాలక 'కృష్ణా! ఇంకఁజాలును. చన్ను విడువుము. విడువుము.' అని యాతనిని మరలింపఁ జొచ్చెను. కాని చనుబాలు చవిఁ గొన్నవానివలెఁ గృష్ణుఁడు చన్నువిడువక పైకొని పాలుద్రావ నారంభించెను. కనుమూసి కనుదెఱచునంతలోఁ గృష్ణుండా రక్కసకాంత సర్వప్రాణంబులను హరించెను అప్పుడు కామ రూపంబును దొఱంగినదై, జీవంబులనెడఁబాసి పెనుగొండ వలె సహజస్వరూపంబున లోకభయంకరంబుగఁ బూతన భూమిపై వ్రాలెను. ఆభయంకరాకారమునుగాంచి గోప గోపికాజనంబులందఱును మిక్కిలిభయంపడిరి. కాని కృష్ణుండు మాత్ర మారక్కసితో నాడుకొనఁజొచ్చెను. అచ్చోట నున్న వారందఱును గృష్ణుని యమానుషచర్య కాశ్చర్య పడుచు నాతండు నిక్కముగ శ్రీహరియే యని తలంచిరి. యశోదయుఁ జంటిబిడ్డయైన కృష్ణుఁడు భయపడెనేమోయని విభూతి మొదలగు రక్షాకరణంబు లొనర్పసాగెను. నందుఁడు

మొదలగు యాదవ ప్రముఖులందఱును గోకులమున నుత్పాత ములు పుట్టుచున్నవని భయపడఁజొచ్చిరి. ఈవిధముగాఁ బూతన ప్రాణంబులహరించి కృష్ణుఁడు కంసుని ప్రయత్నము నిష్ఫలముగఁజేసెను.

లీలామానుష విగ్రహుండైన కృష్ణుండిట్లు నిజమాయా బలంబువలనఁ గంసుని ప్రయత్నంబులను గొనసాగనీయక నిష్ఫలమొనర్చుచు గోపికలతోడను గోపబాలకులతోడను క్రీడింపఁ జొచ్చెను. ఒకనాడు యశోదాదేవి బాలకృష్ణునకు సిగముడిచి గృహాంగణంబున నాడుకొనుటకు వదలిపెట్టియుం

తృణావర్తుని వధ

డఁగాఁ దృణావర్తుఁడను రాక్షసుఁడు కంసుని పంపున సుడిగాలి రూపమునుదాల్చి యాడు కొనుచున్న కృష్ణునెత్తుకొని పోయెను. అచ్చో టనున్న గోపబాలకులందఱును 'కృష్ణుండు పోయెపోయె' నని హాహాకారంబు లొనర్పసాగిరి. ఆబాలకుల రోదనధ్వనుల నాలకించి యశోదాదేవి మొదలుగాఁగల వారందఱును బరుగె త్తుకొని వచ్చి, కృష్ణునకుఁ గలిగిన యాపదను దెలిసికొని పెద్దపెట్టున వాపోవఁదొడంగిరి. ఇవ్విధంబున గోకులంబంతయు బాలకృష్ణునిఁగూర్చి మిక్కిలిగ దుఃఖింపసాగెను. ఇట్లు తన్నుఁ గూర్చి యందఱును విచారించుచుండఁ గృష్ణుండు దానవునిచే నెత్తుకొని పోఁబడిన వానివలె నభోభాగంబునకు వానితోఁ

కూడనరిగి యచ్చోట నాతనికంఠమును బిగియఁబట్టుకొని క్రిందికి వ్రేలాడఁజొచ్చెను. ఆదానవుండా బాలకృష్ణుని బరువును భరింపఁజాలక, క్షణక్షణమునకుఁ గ్రిందికిదిగ నారంభించెను. కాని కుత్తుకబాధ మిక్కుటముగా నుండుటవలన మధ్యేభాగంబుననే యాదైత్యుండు ప్రాణంబులఁ గోల్పోయి యొకపర్వతంబు వడువునఁ బుడమిపయిఁ బడెను. ఆతనితోఁ గృష్ణుండును బుడమికిడిగ్గి తోడిబాలకులఁ గలిసికొనెను. కృష్ణుఁడు తిరిగి కానుపించినంతనే యాగోపబాలకు లందఱానందముతోఁ జిందులుద్రొక్కుచు బాలకృష్ణునెత్తుకొని యశోదాదేవి కడకరిగిరి. పుత్రునికై మిక్కిలిగ వాపోవుచున్న యశోద తనపాపనిఁ గాంచి యపరిమితానందమును బొందెను. గోపికలందఱును గృష్ణుని దిరిగి చూడగలిగినందుకుఁ దమజన్మంబులు సార్థకంబులయ్యెనని తలంచిరి. ఎల్లరును జిన్నికృష్ణునిఁ బరమాత్మగా భావింపఁ దొడంగిరి.

గోకులంబునఁ గృష్ణుఁడిట్లు క్రమక్రమాభివృద్ధినందుచుండ నందుఁడు రోహిణీదేవి కుమారుఁడైన బలరామునిఁ దైకొనివచ్చి కృష్ణునితోనుంచెను. నాటఁగోలె బలరామకృష్ణులిద్దఱును గోపకులంబున మెలంగఁ జొచ్చిరి. దినంబు లివ్విధంబునఁ గడచిపోవుచుండ నొకనాఁడు యాదవపురోహితుండైన

గర్గ మహాముని నందుని మందకుఁ జనుదెంచెను. ఆమహాత్ముని గాంచి నందుఁ డాతని నర్ఘ్యపాద్యాది విధులఁ బూజించి కుమారులైన శ్రీకృష్ణ బలరాములను జూపి వారలకు నామకరణంబు లొనర్పుఁడని యాతనితోఁ బల్కెను. గర్గుండును బలరామునిఁగాంచి, యీతఁడు జనులను రమింపఁ జేయువాఁడు గావున రాముఁడనియు, యదుసంకర్షణంబున సంకర్షణుఁడనియు, ఘనబలమున బలుఁడనియు, హలమునే యాయుధముగాఁ గలవాఁడు గావున హలాయుధుఁడనియు నాతనికి నామకరణంబొనర్చెను. అనంతరము శ్రీకృష్ణునుద్దేశించి, నల్లని శరీరముఁగలవాఁడు గావునఁ గృష్ణుఁడనియు, వసుదేవునకు జన్మించినవాఁడగుటవలన వాసుదేవుఁడనియు, గుణ రూప కర్మంబు లనేకంబులు కలిగియున్నవాఁ డగుట వలనఁ బెక్కునామంబులు గలవాఁడనియు నాతనికి నామకరణంబొనర్చి, యీశిశువులవలన నందగోకుల ముద్ధరింపఁబడుననియు, దుఃఖంబులు తొలంగిసుఖంబులు సేకూరుననియు, మఱియు వారివలన దుర్జన శిక్షణంబును, సజ్జన రక్షణంబును జరుగుననియుఁ దెలియఁజెప్పి బాలకృష్ణుని విశ్వమయునిఁగాఁ దలంచుచు నాతండు తన శ్రమంబున కరిగెను.

గర్గ మహాముని.

బలరామ కృష్ణులిద్దఱును శరీరంబులు రెండుగను, మనంబులొక్కటిగను మెలంగుచు గోపకులతో శైశవక్రీడల

నెఱపుచుండిరి. ఒకనాఁడు గోపకులును, బలరాముఁడును గలసి, శ్రీకృష్ణుఁడు మన్నుఁదినెనని యశోదాదేవితోఁ జెప్పిరి. ఆమెయు వారిమాటలను నమ్మి వెన్నుండు మన్నుఁదినెననియే భావించి యాతనిఁ బట్టుకొని ' అన్నా! ఇదినీకుఁదగునా! ఇంటియందు నీకెన్నియో రుచ్యములైన పదార్థములుండ మన్నెందుకుఁ దింటివి? నానియమములను నీవేలమన్నింపవు? చూడుము! నీయన్నయు నీ సఖులును నీమీదఁ గొండెములు సెప్పుచుండిరికదా?' అని మందలించెను. భయరహితుండగు శ్రీకృష్ణపరమాత్ముఁడు తల్లి మందలింపునకు భయపడినవాని వలెఁ గంటఁదడివెట్టి వెక్కి వెక్కి యేడ్చుచుఁ దల్లియైన యశోదతో—

శా॥ అమ్మా! మన్నుదినంగ నేశిశువనో? ♦ యాఁకొంటినో వెఱ్ఱినో
నమ్మంజూడకు వీరిమాటలు మదిన్ ♦ నన్నీవు గొట్టంగఁదా
రిమ్మార్గంబు ఘటించిచెప్పెదరు కా ♦ దేనిన్ మదీయాస్యగం
ధమ్మాఘ్రాణము సేసి నావచనముల్ ♦ దప్పైనదండింపవే?

అని జాలిఁగొలుపునట్లు పలికి తననోరును దెఱచి 'చూడు' మని తల్లిని సంబోధించెను. ఆమెయుఁ దన ముద్దుపట్టి ముద్దుపల్కులకు మహానందమునుబొంది కుమారుని సత్య ప్రవర్తన మెంతవఱకుఁ గలదో చూతమని యాతని నోరును దిలకించెను. చూచుటయే తడవుగ యశోద విభ్రమాశ్చర్య చకితయై పోయెను. ఆచిన్ని కృష్ణుని నోర నామెకు జలధిపర్వత వన

మృద్భక్షణ విశ్వరూప ప్రదర్శనము

భూగోళఖగోళతరణిశశిదిక్పాలకాదికరండమైన బ్రహ్మాండంబంత యుం గానుపించెను. అట్టి బ్రహ్మాండమును బసిపాపని నోరం గనుంగొని యశోద—

మ॥ కలయో వైష్ణవమాయయో యితర సం ♦ కల్పార్థమో సత్యమో
తలఁపఁగ నేరకయున్నదాననొ యశో ♦ దాదేవిఁ గానో పర
స్థలమో బాలకుఁడెంత యీతని ముఖ ♦ స్థంబై యజాండంబు ప్ర
జ్వలమైయుండుట కేమిహేతువొ మహా ♦ శ్చర్యంబుచింతింపఁగన్॥

అని తనలోఁదాను వితర్కించుకొనసాగినంతనే యామెకుఁ గృష్ణునియెడఁగల పుత్రానురాగంబు దొలంగి భక్త్యావేశ మినుమడించెను. అట్లు భక్తిపరవశయై బాలకృష్ణునిఁ బెక్కు విధములఁ బ్రార్థింపఁ దొడంగెను. కాని కృష్ణుండది యొంతమా త్రమును దగదని యామెను వైష్ణవమాయయందుఁ దగు ల్కొనఁ జేసెను. తోడనే యశోదకు భక్త్యావేశము నశించి పుత్రప్రేమ మినుమడించుచు నామె కృష్ణునిఁ జేరఁదీసి నిజాంక తలంబున నిడికొని "నాతండ్రీ! నిన్నెప్పుడు మందలింపను లెమ్ము" అని యోదార్ప సాగెను. కృష్ణుండును, నేడుపుమాని తల్లికుచవేదికయందు నొదలమోపి కూరుకుసెందెను.

కృష్ణుఁడిత్తెఱంగున నప్పుడప్పుడు గోపగోపికా జనంబు లకుఁ దనసహజ తత్వంబును దెలియఁబఱచుచు నొకప్పుడు భక్తిపరవశులుగను, మఱొకప్పుడు తనయందనురాగము గల

వారిగను, వారినఁదఱి నొనర్చుచుండెను. ఆతండును గోప బాలకులతో నాడుకొనుచు, నప్పుడప్పుడు చోరునివలె నితర గృహంబులందుఁ బ్రవేశించి యందున్న గొల్లపడుచులను గను సైగలు సేయుచును, వెనుకప్రక్కగాఁ జేరఁజని చెక్కిళ్ళ నొక్కుచును, వచ్చెదవాయని రహస్యముగా భాషించుచును, నొంటరిగనున్నఁ బైఁబడి యధర చుంబనాముల నొనర్చుచు నిట్లనేకవిధంబుల మగపోడుములు సేయుచుండుటయే గాక, పిలగు నప్పుడుపాలు పెరుగులఁ గ్రోలుచు, వెన్న నారగించుచుఁ బట్టు కొనవచ్చిన గోపికలను వెఱపించి పాఱిపోవుచు నొక్కొక్క తఱి వారిలో వారికిఁ గలహంబు పెట్టుచు, నిరంకుశాధికారంబున దుండగింబులు సేయఁజొచ్చెను. గోపికలందఱును బాల కృష్ణుని దుండగంబులు నానాటి కభివృద్ధి నందుచుండఁజూచి సహింపఁజాలక యొకనాఁడు యశోదాదేవికడకరిగి, యామె ముద్దుపట్టి తమయిండ్లయందొనర్చిన దుండగంబుల నన్నింటిఁ గూర్చి సవిస్తరముగాఁ జెప్పిరి. చన్నుగుడుచుచున్న కృష్ణుఁడు తల్లి తన్నెక్కడ మందలించునోయని భయ

కృష్ణుని దుండగములు.

పడినవానివలె యశోదయొడియందు ముసుగు వడియుండెను. యశోదయు గోపికలు సెప్పిన వృత్తాంతంబునంతయును విని, వారలఁగాంచి ‘ అమ్మలారా ! మాచిన్నికృష్ణునెందుకట్లుదూఱెదరు? ఎన్నఁడును బొరుగిండ్లను

ద్రొక్కియెఱుఁగఁడే? చక్కగాఁ గన్నులుగూడఁ దెరువని నాయీచిన్నికుమారుని అవ్వాసేయుట మీకుఁదగునా ?

గీ॥ అన్యమెఱుఁగఁడు తనయంత • నాడుచుండు
మంచివాఁడీతఁ డెగ్గులు • మానరమ్మ
రామలార త్రిలోకాభి • రామలార
తల్లులార గుణవతీమ • తల్లులార!

అని యనేక విధంబుల వారల నోడంబఱచి గృహంబులకనిపి కుమారుని మందలింపఁజాలకపోయెను. కృష్ణుండును, దన కేమియుఁ దెలియనివానివలె నటింపసాగెను.

గోపికలు శ్రీకృష్ణుని దుండగంబులఁగూర్చి పలుమారు వచించుచున్నను యశోద, కొడుకు నెంతమాత్రమును మందలింపకుండెను. ఇట్లు దినంబులు సనుచుండ నొకనాఁడు యశోద నిజమందిరంబున దధిమథనంబున మెలఁగుచుండెను. అట్టియెడఁ గృష్ణుండు తల్లిఁజేరంజని పాలీయమని పోరువెట్టఁదొడంగెను. ఆమెయుఁ గుమారునకుఁ జన్నిచ్చుచు నంతలోఁ బొయ్యిమీఁదనున్నపాలు పొంగిపోవుచుండఁ గుండను దింపుటకై కుమారుని వదలిపెట్టిపోయెను. కృష్ణుండును గడుపునిండఁ బాలీయలేదనికోపించి, యెదుటనున్న పెరుగుకుండను బాదములతోఁ దన్ని పగులఁగొట్టెను. పెరుగంతయు నేల పాలయ్యెను. అంతలో యశోద తిరిగివచ్చి కృష్ణుండొనర్చిన

కునికి మిత్రులఁ గోపించి 'దుందుడుకా! నీయాగడ మింక సాగదు లే' యని తనకు భయపడి పరుగెత్తిపోవుచున్న కుమారుని మందలించుటకై వెన్నంటెను. కృష్ణుండును దన లీలావినోదంబుల వలనఁ దల్లిని విభ్రాంతాత్మురాలినిగాఁ జేయుటకో యన నామెకుఁ జేతిదూరముననే యున్నట్లుండి పట్టుకొన వచ్చునంతలో మాయమగుచు, నెందుఁ జూచినఁ గాన్పించుచు, నందందు ముసుఁగువడుచు నిట్లనేకవిధములఁ దల్లిని బాధింపఁ జొచ్చెను. యశోదయుఁ గుమారుని యద్భుత చర్యలకు విస్మయంబునొందుచుఁ బట్టినపట్టుమాత్రము విడువక యాతని వెంబడించుచునే యుండెను. కృష్ణుఁడును దల్లిని శ్రమపెట్టుట భావ్యముగాదని తలంచినవానివలె ననాయాసముగా యశోదకుఁ జిక్కి పోయెను. ఆమెయుఁ గుమారునిఁ బట్టుకొని 'ఓహో! వీరు శ్రీకృష్ణులేనా?' యని యెత్తిపొడుచుచు నాతనిని ఱోలఁగట్ట యత్నించెను, కాని యామె తీసికొని వచ్చిన త్రాడు పొట్టికిని, కృష్ణుని బొజ్జకును గొంచెము తక్కువగా నుండెను. యశోద యింకొక త్రాటిని దానికంటఁ గట్టి కట్టుటకు యత్నింపఁగాఁ దిరిగి పూర్వమెంత తక్కువగా నుండెనో యంతే తక్కువగా నుండెను. ఈవిధముగ గృహములో నున్న రజ్జుపరంపరలఁ గొనివచ్చి కట్టుటకు యత్నించినను

యమళార్జున భంజనము.

దిరిగి పూర్వపుస్థితియే సంభవించుచుండెను. కృష్ణుఁడేమియు నెఱుంగని వానివలెఁ దల్లినిఁజూచి నవ్వసాగెను. అట్టియెడ యశోదమిక్కిలిశ్రమ నొఁదినదై, కుమారునిఁగాంచి 'కృష్ణా! ఏమి నాచేతబంధింపఁబడవా?' యని విచార సూచకముగను భక్తిపరవశత్వమును బొందినదానివలెను బలుక, భక్త పరతంత్రుఁడగు శ్రీకృష్ణపరమాత్మ—సిరికౌఁగిఁట బంధింపఁబడని శ్రీకృష్ణపరమాత్మ—సనకాది యోగిచిత్తాబ్జములందుఁ బట్టువడని శ్రీకృష్ణపరమాత్మ — తల్లివాక్యమును వినినంతనే, లోఁబడి యామెవలన ఱోలఁగట్టఁబడియెను. కుమారునట్లంటఁగట్టి యాయవ్వ యింటిలోనికరిగెను. ఆమె తన్నుబాసీచనినవెంటనే, నారదశాపంబున యమళార్జునంబులను సాల వృక్షంబుల రూపంబున నున్న నలకూబర మణిగ్రీవులను నిర్వురు గుహ్యకులకు శాప విమోచనం బొనర్పఁ దలంచి, ఱోలడ్డమగునట్లు వృక్షంబుల మధ్యభాగంబున కరిగెను. అవియు ఱోటిచేతాకుడునకు నిర్మూలంబులై పుడమిపయింబడ నందుండి యాగుహ్యకులిద్దఱును శాపవిముక్తి వలన బయలు వెడలి యనేకవిధంబులఁ గృష్ణపరమాత్మను బ్రార్థించుచుఁ దమ నివాసంబులకుఁ జనిరి.

ఇట్లు కృష్ణుండు సాలవృక్షంబులఁగూల్ప దన్నిర్మూలన ధ్వనులకు గోపగోపికాజనంబులందఱును వెఱఁగంది పిడుగులు

వడెనని తలంచుచు వచ్చిచూడఁ గృష్ణుఁడా వృక్షంబులమధ్య భాగంబునఁ గపట బాలలీలల వినోదించుచుండెను. అప్పు డందఱును, 'ఏమిది? పెద్దగాలి వచ్చినదనుకొందమా యది యెంతమాత్రమును సరిగాదు. పిడుగుపడినదనుకొందమా తగినసూచకము లెవ్వియును గాన్పింపవు. అకారణంబుగ నీవృక్షంబు లేలగూలినవి ? ఈతఁడు పడఁ

గోప గోపికారాధనము.

ద్రోసినాఁడనుకొందమా కేవలము పసిబా లుఁడు. ఏమివింత' యని తమలోఁ దాము తర్కించుకొనుచుండ నంతకుమున్నచ్చటనున్నవారు కృష్ణుని వలననే యాపని జరిగెనని తెలియఁజేసిరి. అప్పుడు నందాదులైన గోపకులును, యశోద మొదలైన గోపికలును గృష్ణుని లీలామానుషవిగ్రహుండైన పరమాత్మునిఁగాఁ దలంచి, రెట్టించిన భక్తితాత్పర్యంబుతో నాతనిఁ బూజింపఁదొడఁగిరి.



# ౫

బృహద్వనంబున నుత్పాదంబులు పెక్కులుప్పతిల్లుచుండుటవలన నందుఁడు సునందుఁడు మొదలగు యాదవ ప్రముఖులందఱును దద్వనంబును విడనాడి బృందావనంబునకు గోగణంబులతో నరుగుటకు నిశ్చయించుకొని యప్పటికప్పుడే బృందావనంబున కరిగిరి. అచ్చోట బలరామకృష్ణు లిద్దఱును దోడి గోపకులతోఁ గలసి యాడుకొనుచుఁ బసుల వెంట నరిగి బంతిచల్దులారగించుచు, నొకరితో నొకరు బందెములు వెట్టి పరుగులెత్తుచు నిట్లనేకవిధముల శైశవక్రీడలందుఁ గాలమును గడుపసాగిరి. కృష్ణుండప్పుడప్పుడు గోగోపికా సంఘంబులు శరీరంబులు మఱచి యుండునట్లు యమునానదీ పులిన స్థలంబుల మురళీగాన మొనర్పసాగెను. యశోదాకుమారునిమ్మృదుల మధుర మురళీ నిస్వనంబులకు గోపికలందఱును ముగ్ధలగుచు నింటిపనులఁగూడ మాని తదారవంబు శ్రవణపుటంబుల దాఁటినంతనే కోకలు జారుచున్నను, వేణీబంధంబులు విడివడుచున్నను, స్తనభారంబున లేనడుము లల్లలనాడ నాయాస మినుమడించుచున్నను లెక్కసేయక మురళీమోహన కృష్ణునిఁ జేరంజనుచుండిరి. తదారవంబును వినినంతనే గోగణంబులును

బృందావన విహారము.

మేతలమాని యఱ్ఱులెత్తి చెవులు నిక్కిరించుకొని తన్మోహన నిస్వనరసనిర్ఝర ప్రబలవేణికలందుఁ గ్రుంకులిడఁ జొచ్చెను. బాలకృష్ణుండీవిధంబున నిజ మురళీగానంబున విశ్వంబును మోహింపఁజేయుచు బృందావన విహారంబు నొనర్పసాగెను.

కృష్ణుండీవిధంబున విశ్వమోహన మూర్తియై బృందావనంబున వెలుంగుచుండ నచ్చోట మధురాపురంబునఁ గృష్ణుని వృత్తాంతంబు వినవచ్చినకొలంది కంసునకు మనస్తాపంబినుమడింపసాగెను ఇంతవఱకాతఁడొనర్చిన కృష్ణవధోద్యోగ ప్రయత్నంబులన్నియు నిష్ఫలంబులగుటవలన నాతనికిఁ బట్టుదల మఱింత హెచ్చిపోయెను. అందువలన నాతని క్రూరచర్యలు తొల్లింటికన్న మిక్కుటములయ్యెను. ఎచ్చోటఁ జూచినను దైత్యభటుల యార్భాటములును, సాధుజన హింసాపరాయణత్వంబును, క్షణక్షణమునకు మించుచుండెను. పశుహింసయుఁ దపోవన నిర్మూలంబును, యాగ విధ్వంసమును, మునిజన నిష్ఠాపహరణంబును, శిశుమారణంబును, మొదలగు ఘోరకృత్యములు ప్రబలములయ్యెను. జగదపకారంబునకుఁ గంసుఁడు ముందంగవైచుచుండెను. ఎల్లెడల దానవాపచారస జంతసాధు జన దీనారవంబులు మిక్కుటముగ వినవచ్చుచుండెను. ఆహా! సర్వజ్ఞుఁడైన శ్రీకృష్ణపరమాత్మ తనవిహారవిహారంబుసఁ జేసి సాధుజనంబులిట్లు కంసునివలనఁ బెక్కు బాధలకుఁ

దానవుల క్రూరకృత్యములు.

నగుచుండఁ దద్వృత్తాంతంబంతయు నెఱింగియు సహించి యుండుటేల్లకో గదా?

బృందావన ప్రాంతారణ్య భూములంగల వచ్చికబయళ్లయందు శ్రీకృష్ణుండు గోపబాలక బలరామ సహితుండై గోవులను గాయుచుండ నొకనాఁడు కంసప్రేరితుండై వత్సాసురుండను దైత్యభటుఁడొక్కఁడు కామరూపంబున మందలోఁ బ్రవేశించి గోపకులను గోవులను బాధింపఁ దొడంగెను, ఆవృత్తాంతంబును గృష్ణుఁడెఱింగి యన్నయగు బలభద్రునకా సమాచారంబంతయుఁ దెలియఁజెప్పి, వత్సంబు పగిది మందయందు సంచరించుచున్న యాదైత్యభటుని సమీపించి 'ఆహా! ఈలేగ యెంత యందముగానున్నది? ఈదూడను మీకుఁగాకుండ నేనుహరించెద" నని గోపబాలకులతో నర్మగర్భంబుగాఁ బలుకుచు వత్సాసురునిఁ దోకమొదలు కంఠమువఱకుఁ దన యాజాను బాహు బంధంబున నిరికించుకొని యూపిరి యాడకుండునట్లు నొక్కుచుఁ ద్రుటికాలములో విగతజీవునిఁగా నొనర్చి బంతిచందమున నవలీల గగనమార్గంబున కెగుర వైచెను. ఆదైత్యుండును మొదలునఱికిన తిరుపువలె ధరణిపై నొదిగి యసువులఁ బాసెను.

వత్సాసుర వధ

అతండట్లు మడిసినతోడనే యతని యనుచరుండగు బకాసురుండను వాఁడు భయంకరాకారంబుతో గోగోపసంఘంబుపైఁ గవిసి

బకాసుర వధ

మహాట్టహాస మొనర్పసాగెను. ఆదైత్యుని ఘోరాకారమునకు భయంపడి గోపులును, గోపకులును బరుగెత్తసాగిరి. అట్లు తన్ను గాంచి భయభ్రాంతులై పాఱిపోవుచున్న గోగోప బృందంబులనువదలి యాదైత్యుండు కృష్ణునిపై విజృంభించెను. అట్టియెడ జితవైరియగు నందనందనుఁడు వెఱఁగందినవాని చందంబున నందంబుఁ జిందులు ద్రొక్కనారంభించెను. బకాసురుండును గృష్ణునిఁ దనకులోఁబడినవానిఁగాఁదలంచి యొక్క పెట్టున నాతనిపైఁబడి గుటుక్కున మ్రింగివైచెను. కృష్ణుఁడు దైత్యునివలన మ్రింగుడువడుటఁ గాంచి గోపకులు "హాకృష్ణా హా కృష్ణా!" యని హాహాకారంబులు సేయందొడంగిరి. గోపులు కనులవెంట నశ్రుధారల గురియింపఁజొచ్చెను. వికసితకుసుమపరిశోభితములైన లతానివహంబులు గళాహీనములై కాన్పింపఁదొడంగెను. ఇట్లు విశ్వంబంతయుఁ దనకై విచారించుచుండఁ గృష్ణుండును బకునివలన మ్రింగుడువడి కంఠభాగంబునందే నిలచి తనయందు లీనమైయున్న ప్రళయకాలానలంబును రగుల్కొల్పి తన్మూలమునను దాను కుత్తుక నొక్కుచును గనురెప్పపాటుకాలముననే యాదైత్యుని సర్వప్రాణంబుల హరించి మడియింపఁజేసెను. ఆతండు మరణించిన వెంటనే తద్గర్భంబునుండి వెలికివచ్చి గోగోపసంఘంబులకు దర్శనమిచ్చెను. తిరిగి కృష్ణునిఁగాంచినంతనే గోపకు లందఱు

నానంద పారవశ్యమునఁ జిందులు ద్రొక్కుచు గొంగడుల నెగురవైవసాగిరి. గోగణంబులును 'అంబా' యని యఱచుచుఁ దోఁకలెత్తి పరుగిడసాగెను. ఇవ్విధంబున దైత్యవధంబు నొనర్చి శ్రీకృష్ణుఁడందఱికిని సంతోషముఁ గూర్చెను.

శ్రీకృష్ణ పరమాత్ముని లీలామానుషచర్యలు సకల భువనంబులయందును బ్రతిధ్వనులీనుచుండ సత్యలోక నివాసి యైన బ్రహ్మదేవుఁడతని నొకయలంతి మానవునిఁగాఁ దలంచి యాతని సామర్థ్యమెట్టిదో పరీక్షింపఁ దలంచినవాఁడై యొక నాఁడు కృష్ణుఁడు గోపబాలకులతోఁ బసులఁ గాయుచుండ గోవులను గోపబాలకులను హఠాత్తుగా మాయ మొనర్చెను. కృష్ణుఁడొక్కరుండే వనమధ్యంబున నిలచియుండెను. బ్రహ్మ యొనర్చినపని కాతఁడెంతమాత్రమును విస్మయంబునొందక సర్వజ్ఞుఁడగుటవలనఁ గలరూపెఱింగినవాఁడై పరమేష్ఠి నవమానింపఁదలంచి గోవులును, గోపకులును దానయై యథాప్రకారము వర్తింపఁ దొడంగెను. గోగోపకులు శ్రీకృష్ణ స్వరూపులుగానఁ జూచువారలకొక విధమగు దన్మయత్వము గలుగ నారంభించెను. తమ పుత్రులు కృష్ణాంశసంభవులుగాన గోపికలకుఁ దొల్లింటికన్న సుతప్రేమ యెక్కువయ్యెను. బలభద్రుండును నీయద్భుత సంఘటనంబున కచ్చెరువొందుచుఁ గలరూపు నెఱుంగఁజాలక 'ఇదియేమి' యని తమ్ముని నడిగెను. కృష్ణుం

బ్రహ్మదేవుని పరాభవము.

డును బలభద్రునకు సర్వమును దెలియపఱచెను. అత్తెఱం
గున నొకవత్సరంబు ముగిసినవెంటనే బ్రహ్మ కృష్ణుని పరిస్థితి
యెట్లున్నదో యని వచ్చి చూచునప్పటికి గోగోపకులతో
యశోదానందుఁ డెప్పటియట్ల విహరించుచుండెను. ఆదృశ్య
మునుగాంచినంతనే బ్రహ్మయు 'సృష్టికర్తను నేనైయుండ నీ
గోగోపకులను సృష్టించినవారెవరా?' యని పెద్దయుఁబ్రొద్దు
దనలోఁదాను వితర్కించుకొనుచుఁ గొంతవడికి శ్రీకృష్ణమహి
మంబువలన వైష్ణవమాయనుండి విడివడినవాఁడై సర్వమును
దెలిసికొనెను. అప్పుడు కమలాసనుండు దానొనర్చినపనికి
లజ్జించుచుఁ బ్రత్యక్ష స్వరూపంబునఁ గృష్ణపరమాత్మను
జేరంజని ముకుళిత కరకమలుండై 'దేవా! నీమాయయందుఁ
దగుల్కొని యజ్ఞానుండనై, నీకపచారమును గావించితిని.
మహాత్మా! నన్ను క్షమింపుము. నీవాదినారాయణుండవు.
నీతత్వంబు నెవ్వరును గ్రహింపఁజాలరు. నీవలననే సృష్టి
స్థితిలయములు జరుగుచున్నవి. నీయందే సకలచరాచరా
త్మకమైన యీవిశ్వంబంతయు లీనమైయున్నది. గుణకర్మంబు
లనేకంబులు గలిగియున్నవాఁడవగుటవలనఁ బెక్కునామంబుల
తోడను, బెక్కురూపంబులతోడను వర్తించుచుందువు. పరా
త్పరా! నన్ను క్షమియింపుము' అని యాతనిఁ బ్రార్థింప వసు
దేవనందనుఁడు గరుణామయుండుగావున వేల్పుపెద్దను క్షమిఁ

చెను. విరించియుఁ దిరిగి గోగోపకులను గృష్ణునకర్పించి నిజనివాసంబునకరిగెను. బ్రహ్మ గోగోపకుల నర్పించినంతనే శ్రీకృష్ణపరమాత్మ తన విశ్వరూపంబు నుపసంహరించి యొక వత్సరము తన్నెడఁబాసియున్న గోపకులనందఱిని వేర్వేరనాదరించి యాదవవంశ భూషణుండగుచుఁ బ్రకాశింపఁ జొచ్చెను.

బలరాముఁడెల్లప్పుడుఁ దమ్ముఁడైన శ్రీకృష్ణునెడఁ బాయక మందయందు సంచరించుచు గోపబాలురతోఁ గూడి యాడుచుండెడివాఁడు. ఒకనాఁడేమి కతంబుననో శ్రీకృష్ణుండు గోవులవెంటరాక యింటనే నిలచియుండెను. బలభద్రుండు మాత్రము గోపబాలురతోఁ గలసి పసులవెంట నరిగెను. అచ్చోట గోపకులందఱును బలరామ సహితులై బంతిచల్దుల నారగించి తలకొకదిక్కున మెలంగుచు నప్పుడప్పుడు గుంపు గట్టియాడుకొనుచుఁ బ్రొద్దు పుచ్చుచుండఁ గం

బలరాముడు ఖరాసురుని వధించుట

సుపపంపున నొకదైత్యభటుండు ఖరాకారంబున జనుదెంచి మందయందు శ్రీకృష్ణుడు లేడు గదాయని ధైర్యంబు నవలంబించి గోవులను గోపకులను హింసింపసాగెను. అట్టియెడ గోపకులు భయంపడి 'ఓకృష్ణా! ఓరామా! రక్షింపుఁడు. రక్షింపుఁడు' అని పెద్దపెట్టున గోల లెత్తుచు బలభద్రుండున్న తావునకువచ్చి చేరిరి. ఖరాసురుండును వారిని వెన్నంటి వచ్చి గోపబాలక రక్షణార్థమై తన్ను

మార్కొన నిలచియున్న బలరాముని నొక్కపెట్టున ఱొమ్మునం దన్ని యార్చుచు విజృంభించెను. కృష్ణానుజుండును వ్రేటువడిన వెంటనే రౌద్రాకారంబున విజృంభించి గర్దభాసురు పదంబులు నాలుగు నొక్క కేలనంటఁబట్టి బెట్టుదట్టించి యట్టిట్టు గదల్చుచు నొక్కపెట్టునఁ గందుకంబు చందంబున నభోభాగంబున కెగురవైచి యాదైత్యుని విగతజీవునిఁగా నొనర్చెను.

అట్లు ఖరాసురుని నవలీలగా మడియించి బలరాముఁడు తిరిగి యథాప్రకారము గోపబాలకులతో నాడుకొనఁజొచ్చెను. అట్టిసమయంబున ఖరాసురుని యనుచరుండైన ప్రలంబుండను రక్కసుండు పగసాధింపఁదలంచి గోపబాలక వేషముతోఁ జనుదెంచి యచ్చోట నాడుకొనుచున్న బలరామాదులతోఁ గలసి తానుగూడ నాటలాడఁజొచ్చెను. గోపకులందఱును రెండుగములవారై, యోడిపోయినవారు, గెలిచిన వారిని మోయునట్లు బందెము వెట్టికొని యాడుకొనుచుండిరి. ప్రలంబుఁడు పగసాధింపఁ దలచియున్నవాఁడు గావున బలరామున కెదురగువారి వైపునఁ జేరెను. కర్మవశంబున బలరాముని వైపువారే యాటయందు గెలిచిరి. అప్పుడనుకొనిన ప్రకారము ఓడిపోయినవారు గెలిచినవారినొక్కొక్కరిని తమమూపులపై నెక్కించుకొని మోయఁజొచ్చిరి. అట్టి

బలరాముఁడు ప్రలంబునివధించుట.

యెడ నదియే సమయమని ప్రలంబుఁ డోడిపోయినవారియం దున్నవాఁడగుటవలన బలరాముని దన మూపున నెక్కించుకొనియున్నటులుండి గగనమార్గంబున కెగసెను అదిగని గోపకులందఱును రామునికై దుఃఖింపఁ దొడఁగిరి. మోసంబునఁ దన్నట్లుమోసికొని గగనమార్గంబున నరుగుచున్న ప్రలంబుని కపటంబు నెఱింగి, బలభద్రుండుక్కుమిగిలి తనముష్టిహతిని దైత్యునిశిరంబువగులఁజేసి విగతజీవునిఁగానొనర్చి యచిరకాలముననే గోపకులఁజేరివారికి సంతోషముఁగూర్చెను. గోపకులును బలరాముని గొప్పవానిఁగాఁ దలంచిరి.



## ౭

శ్రీకృష్ణబలరాము లిత్తెఱంగునఁ జేఁజిక్కిన దైత్యులఁ బట్టి చక్కాడుచు గోగోప గోపికాసంఘంబుల రక్షించుచు బృందావనంబున విహరింపఁ దొడంగిరి. గోపికలందఱును శ్రీకృష్ణునియం దెక్కుడ మక్కువఁగలిగి యెల్లప్పుడాతని దివ్యసందర్శనంబునే యాకాంక్షించుచు ననవరతమాతని మురళీ మధుర నిస్వనంబునేకోరుచుఁ బ్రొద్దులుపుచ్చుచుండిరి. కృష్ణుండును బెక్కుతెఱంగులఁ బల్లవకోమలసదృశాకారిణులగు వల్లవీజనంబుల యుల్లంబు లుల్లాసంబున రంజిల్లునట్లువర్తింపఁ దొడంగెను. ఒకనాడు గోపికలందఱును యమునాస్నానంబున కరిగి యొడ్డున వస్త్రంబులను హారాది పరిష్కారంబులను బదిలంబులుగా నొనర్చి, కంఠదఘ్నంబులగు సలిలంబుల జలకంబులాడఁ దొడంగిరి. అట్టియెడఁ దుంటరి

గోపికా వస్త్రాపహరణము.

యగు బాలకృష్ణుండు యమునానదిఁ జేరజని గట్టుననున్న గోపికల వస్త్రంబులను మెల్లన దొంగిలించి తత్తటినీతట నికటంబున నున్న వృక్షంబు నధిరోహించి లీలామాత్రుండై వినోదింపసాగెను. గోపికలును గొంత వడికిఁ గృష్ణునిరాకను గుర్తించి తుంటరి వాడగుటవలన ననుమానపడి గట్టునకుఁజూడ వస్త్రంబులు లేకుండెను. ఏమా

యని కృష్ణునిదెసఁ బరికింప నాతండధిరోహించియున్న తరు శాఖలయందుఁ దమవస్త్రంబులుంటఁగాంచి మోసమయ్యెనని తలంచుచు మానభంగంబునకు వెఱచినవారలై, నదీగర్భంబు నందే నిలచి లీలావినోదియైన శ్రీకృష్ణ పరమాత్మను గూర్చి 'కృష్ణా! ఇదియేమిన్యాయము? కేవలము పరమాత్మ స్వరూపుండవును, సర్వజ్ఞుండవునునగు, నీవే స్త్రీజనమానభంగమున బ్రయత్నింప నన్యులఁగూర్చి వేఱచెప్పవలయునా? మావలువల మాకొసంగుము. మామగవారు జూచిన నిన్నుమందలింతురు. రమ్మి. మాచీరెలఁ గొనితెచ్చి యిచ్చిపొమ్మి. ఇది యేనా నీయట్టివాఁడొనర్పవలసిన ఘనకార్యము? కృష్ణా!

సీ॥ బహుజీవనమ్ముతోడ • భాసిల్లియుండుటో
గోత్రంబునిల్పుటో • కూర్మితోడ
మహినుద్ధరించుటో • మనుజసింహంబవై
ప్రజలఁగాచుటో కాక • బలిఁదెరల్చి
పిన్నవైయుండియుఁ • బెంపువహించుటో
రాజుల గెల్చుటో • రణములందు
గురునాజ్ఞసేయుటో • గుణనిధివై బల
ప్రఖ్యాతిఁజూపుటో • భద్రలీల

ఆ॥ వె॥ బుధులుమెచ్చ భువిఁ బ్ర • బుద్ధతమెఱయుటో
కల్కితలము సేయు • ఘనతగలదె?
వావిలేదువారి • వారునావారని
యెఱుఁగవలదె? వలువ • లిమ్ము కృష్ణ ! "

అని మందలించినట్లుగను, ధర్మోపదేశం బోధించినట్లుగను, బ్రతిమాలుకొని నట్లుగను, మొరవెట్టుకొన నాతండును వృక్షంబునందే నిలచి నగుచు "గోపికలారా మీరందఱిచ్చోటి కరుగుదెంచి మీమీవలువలఁ గోలుపోయిరి. నేనుమాత్రము తీసికొనివచ్చి మీకొసంగ’ నని ఖండితముగాఁ దెలియఁజెప్ప గోపికలును దమకు మానభంగ మెట్లును దప్పదని నిశ్చయించు కొని, పోవుదమని కొందఱును, వలదని కొందఱును ముందు వెనుకలాడుచుఁ దుదకందఱును నిజకరసంఛాదిత పంచాయుధ గేహాలగుచుఁ గృష్ణునిఁ జేరంజని వలువలిమ్మనికోర నాతండును "సుందరాంగులారా! ఒక్కమాఱు చేతులెత్తి మీరందఱు నన్నుఁ బ్రార్థింపుఁడు. వలువలొసంగెద" నని పలుక గోపికలు ‘ఏమి? ఈబాలుని తుంటరితనము? అంతకంతకు మితిమీఱిపోవుచున్నదే’ యని లోనఁగినుకవహించినవారలయ్యుఁ దప్పనిదియగుటవలన మానభంగంబునకుఁగూడ శంకింపక చేతులెత్తి వలువలిమ్మని యాతనిఁ బ్రార్థించిరి. కృష్ణుఁడప్పుడు వృక్షంబునుండి డిగ్గి వలువలను వారికొసంగి, "గోపికలారా! మీకు మానభంగమయ్యెనని యెంతమాత్రమును జింతింపవలదు. నన్నుఁగొల్చువారలకు సర్వంబును నా స్వరూపమై కానుపించును. అట్టియెడ ‘వీరు పురుషులు, వీరుస్త్రీలు, అను విచక్షణ యెంతమాత్రమును వారియందుం

డదు. అట్టిభేదభావము లేనివారలే నాకు నిజమైన భక్తు లగుచున్నారు. మీస్వభావంబును గుర్తెఱుంగుటకై మిమ్ము త్తెఱంగునఁ బరీక్షించితిని. నావచనప్రకారము వర్తించి మీరునాకు నచ్చినవారలైతిరి. ఇదియే నాతత్వము" అని తెలియఁజెప్పి గోపికల మనస్తాపంబును మాన్పెను. వారును ధన్యులమైతిమని కృష్ణునితోఁ గలసి గోకులంబునకరిగిరి.

వస్త్రాపహారణం బొనర్చి వల్లవీజనంబుల శ్రీకృష్ణుండు పరిభవించెనను వార్త యెవ్విధంబుననో నందయశోదలకుఁ దెలియవచ్చెను. చూచుచుండఁగనే యావార్త గోపకులంబు నం దంతటను వ్యాపించెను. ఎల్లరును గృష్ణుని దుండగంబును గూర్చి పలుభంగుల ముచ్చటింప సాగిరి. తమ కుమారుడొన ర్చిన పనికి నందయశోదలు కినుకవహించిన వారలై కృష్ణునిఁ జేరంబిలిచి 'కుమారా! రోజురోజుకు నీయాగడంబులు మితి మీరుచున్నవి. చూచి యుపేక్షాభావమును వహించుచుంటి మని తలంచుచుంటివా యేమి? కృష్ణా గోపికా వస్త్రాపహార ణం బొనర్చి మానభంగమును గావించుట నీయట్టివానికిఁ దగునా? ఇంతటినుండి నీవిట్టి దుండగముల నెన్నండును జేయకుసుమా,' యని యనేకవిధంబుల మందలించిరి. అప్పుడు

నందయశోదలు శ్రీకృష్ణుని మందలించుట.

కృష్ణుండు, కనులవెంట నీరునింపుచు 'జననీజనకులారా! మీతో

డను, మీగోపగోపికా జనంబులతోడను నాకెంతమాత్రమును బనిలేదు. ఇందటిపలన మాటఁబడిన యీబ్రతుకుఁగూడ నా కవసరము లేదు. నేనిప్పుడేపోయి విషజలపూరితంబగు గాళిందీ నదిలోదుమికెదను. ఇంతటినుండి మీరును, మీకులము వారును నావలన నెట్టిబాధలను బొందకుండ సుఖంబుండుఁడు' అని పల్కినవాఁడై యప్పుడే కాళిందీనదికిఁ బరుగులిడ సాగెను. యశోదానందులును, సకలగోపగోపికాజనంబులును, దుదకు గోగణంబులును, "కృష్ణా! పోకుము. కాళిందీనదిలో దుముకవలదు. నీయిష్టమువచ్చినట్లు మమ్మందఱను బాధింపుము. నిన్నుఁబాసి యొక్క క్షణమైనను మేము నిలువఁజాలము." అని దుఃఖించుచు లీలావినోదియైన బాలకృష్ణుని వెంబడించిరి. బలభద్రుఁడు తమ్ముని తత్వంబు నెఱింగినవాఁడయ్యు, నేమియు నెఱుఁగనివానివలెఁ దాచుచు బంధుజనంబుల వెంబడించెను. ఇట్లు యాదవకులంబంతయుఁ దన్ను వెంబడించుచున్నను, నొక్కరికేనియుఁ జిక్కక, కాళిందిని సమీపించి, నిజచరణకమలయుగళసంస్పర్శంబున కెన్నినాళ్ళనుండియో యెదురుసూచుచుఁ దత్సమీపంబున విశాల విటపశాఖాసముదయంబుతోనున్న కదంబ భూజంబు నధిరోహించి తదగ్రంబున కెగఁబ్రాకి దూరంబుననుండి బంధుజనులు దన్నుఁగూర్చి యాక్రోశించుచుండ, నెల్లరకుఁ

దెలియవచ్చునట్లు కుప్పించియచ్చోటనుండి కాళిందిలో దుమికెను. వెంటనే యాహ్రదంబంతయు గుభగుభ ధ్వానంబులతో నల్లకల్లోలంబుగాఁజొచ్చెను. ఇచ్చోట యశోదానందులు మొదలగువారందఱును గృష్ణుండు నదిలో దుముకుట కనులారగాంచి 'హా! కృష్ణా! హా! కృష్ణా!" యని పెద్దపెట్టున నేడ్చుచుఁ గాళిందిని సమీపించి బాలకృష్ణునిఁగానక ఘోరవిషానల దారుణాకారుండగు కాళీయునిచేత భక్షింపఁబడెనని తలపోసి, తద్వియోగ సంజనిత సంతతానంతదుఃఖాతిరేకంబున స్మృతులుదప్పి పుడమిపై మూర్ఛిల్లిరి. బలరాముఁడుమాత్రము సర్వము నెఱింగినవాఁడుగావునఁ జూచి యూరకుండెను.

కాళిందీనదియందుఁ గాళీయుఁడను సర్పరాజొకండు గలఁడు. పూర్వమొకప్పుడు సర్పములన్నియు వినతాసుతునకు భయంపడి, తాము సంపాదించుకొనిన యాహారంబునందు సగపాలతని కిచ్చునట్లును, నాతండు తమ్ముఁ జంపకుండునట్లును, నొడంబడికఁ జేసికొని, యప్పటినుండి యనుకొనిన ప్రకారము వర్తింపఁజొచ్చెను. కాని కాళీయుఁడు మాత్రము తాను సంపాదించిన యాహారంబులోని సగపాలును విహంగవల్లభున కర్పింపక తానే యాస్వాదనంబుగఁ గుడువఁ దొడంగెను. అందువలన వైనతేయుఁడు కినుక

వహించి కాళీయునిఁబట్టి శిక్షించుటకు దండెత్తి

కాళీయుని పూర్వకథ

రాఁగా నతండు పన్నగాంతకునకు భయంపడి యాతని నెదుర్కొనఁ జాలక కాళిందీ నదియందుఁ జొచ్చి ప్రాణరక్షణ మొనర్చుకొనెను. సుపర్ణుఁడు కాళిందీ నదిఁజొచ్చుటకు భయపడెను. కారణ మేమన నాతండొక నాఁడు క్షుద్బాధ నపనయించుకొను నిమిత్తమై కాళిందీ మడుగులోని చేపలనుబట్టి భక్షించుచుండఁగా మత్స్యంబులన్నియుఁ బ్రాణ రక్షణంబునకై తత్సమీపారణ్యంబునఁ దపంబుసేసికొనుచున్న సౌభరియను మునిపుంగవుని శరణు జొచ్చెను. ఆతండును వానిపైఁగరుణవహించి నాఁడు మొదలు వైనతేయుండా నదియందుఁ బ్రవేశించినచో శిరంబువగిలి మడియుఁగాతయని యుగ్రశాపమిచ్చెను. ఈవృత్తాంతమును గాళీయుఁడెఱింగియున్న వాఁడగుటవలన నామడుగునందుదూఱి ప్రాణరక్షణ మొనర్చుకొనెను. ఆతండామడుగున నివసింపఁ దొడంగి నప్పటినుండియుఁదన విషంబువలన, జలంబును విషపూరితంబుగానొనర్చి, యానీరును గ్రోలినవారలనేగాక తుదకా నీటికి సూటిగ నభోభాగంబునఁ జరించు ద్విజసంతతులను గూడ మడియఁజేయుచు లోకభయంకరుండై మెలంచియుండెను. అందువలనఁ బ్రతివారును గాళిందిలోఁ బ్రవేశించుటకేగాక తుదకు సమీపించుటకుఁగూడ భయపడుచుండిరి. ప్రాణోప

ద్రవకరమగునట్టి యీమడుగునందే కృష్ణుఁడుదుమికెను. అందు వలననే గోపకులంబంతయు నాతనిఁగూర్చి దుఃఖింపసాగెను.

కృష్ణుఁడట్లు తన నివాసంబగు కాళిందియందు దుమికి నంతనే, కాళీయుఁడు రౌద్రాకారంబున విజృంభించి "ఏమిది? పర ప్రాణాపహరణప్రయుక్తవిషానలజ్వాలా సమేతుండనగు నన్నుమఱచి యీబుడుతఁడిందుదుముకుటకుసాహసించెఁగా? ఔరా! ఈకాళీయుని ప్రభావమాతనికిఁ దెలియదు కాబోలు! ఒక్కమాఱు నాశక్తినిజూపెదఁగాక'యని పడగలను జక్కగా విప్పి ముఖంబులనుండి విషానల విస్ఫులింగంబులు ప్రజ్వరిలు చుండ శరీరంబునుబెంచి బాలకృష్ణుని నాపాదమస్తకంబుగాఁ జుట్టి యాతని గాత్రంబునందంతటను గంటులువడునట్లు కఱవ సాగెను. కృష్ణుఁడును లీలావినోదియై చేష్టలులేనివాని తెఱంగున భోగిభోగ పరివేష్టితుండై నదీతోయంబుల నుయ్యాల లూగ నారంభించెను. అట్టియెడ యశోదానందులు మొదలగు యాదవు లందఱును మూర్ఛనుండితేరి కనులవిచ్చి నదివంక దిలకించునప్పటికి కృష్ణుండు కాళీయునిచేతఁ జుట్టఁబడి చేష్టలు దక్కియుండెను. అట్టి యపాయస్థితియందున్న బాలకృష్ణునిఁ గాంచి స్త్రీపురుష బాలవృద్ధసమేతంబుగ యాదవులందఱును బెద్దపెట్టున విలపించుచు 'హా! కృష్ణా! కృష్ణా! ఇంక మాకు దిక్కెవ్వరు? మేమిందర ముండియు నిన్ను రక్షింపఁజాల

నందగోకులము కృష్ణునిగూర్చి దుఃఖించుట.

మైతిమే? అయ్యో! కుమారా! నిన్నీ యాపద
నుండి కాపాడువారెవ్వరు? విషకుచదుగ్ధంబులఁ
ద్రావియు నేహానియులేక బ్రతికియున్న నీకు
నేఁడీ కాళీయుని విష మపాయంబును గూర్చు
చుండెఁగదా? కృష్ణ! నేటినుండిమాకు ముద్దుముచ్చటలు
నెప్పువారెవ్వరు? అందెలుపాదములందు మ్రోయ మాదాపు
నకువచ్చువారెవ్వరు? కుమారా! కుమారా! అయ్యో! తండ్రీ!

సీ॥ శ్రవణరంధ్రంబులు ♦ సఫలతఁ బొందంగ
నెలమి భాషించు వా ♦ రెవ్వరింకఁ
కరచరణాదుల ♦ కలిమి ధన్యతనొంద
నెగిరి పైఁ బ్రాకువా ♦ రెవ్వరింక
నయన యుగ్మంబులు ♦ న్నతిఁ గృతార్థములుగా
నవ్వులఁ జూపు వా ♦ రెవ్వరింక
జిహ్వలు గౌరవ ♦ శ్రీఁ జేరఁ బాటల
యెడఁ బలికించు వా ♦ రెవ్వరింకఁ

ఆ॥ వె॥ దండ్రినీవు సర్ప ♦ దష్టుండ వైయున్న
నిచటుమాకఁ బ్రభువు ♦ లెవ్వరింక
మరగి పోయలేము ♦ మాకు నీతోడిద
లోక మీవులేని ♦ లోకమేల?"

అని యందఱును గుంపుగట్టి నదియందుఁ జొచ్చుటకుఁ గడం
గిరి. అట్టియెడ బలభద్రుం డడ్డంబువచ్చి కృష్ణునకెంతమాత్రం
బపాయంబు సంభవింపనేరదని వారికి నచ్చజెప్పి వారియుద్య
మంబును మాన్పెను.

కృష్ణుఁడును బంధుజనుల దుఃఖావస్థనుగాంచి యుపేక్షించుట మంచిదిగాదని యెంచి యుంచితంబుగ మేను వెంచి మించి కాళీయుని పంచప్రాణంబులవంచింప నుంకించి రెట్టించిన యట్టహాసంబున విజృంభించి, వడిగలిగిన పడగలమీఁద నడిదంబు వడువున నాభీలంబగు నిజకరంబు నెత్తి ప్రచండ ధ్వానంబనూనంబగునట్లు సటచేను. ఆవేట్లునకు శిరంబులు వగిలి నెత్తురులు గ్రక్కుచుఁ గాళీయుఁడు చేష్టలుదక్కిన వాఁడయ్యెను. అట్టియెడఁ గృష్ణుఁడాతని ఫణంబులపైకెక్కి కన్నులు వెలికి, దౌడలువట్టి నాలుకల నూడఁదీసి, యుప్పొంగుచు గజ్జెలందియలు ఘల్లుఘల్లుమని మ్రోయ నహివాళియందు నృత్యంబు సేయఁజొచ్చెను. కాళీ

కాళీయమర్దనము.

యుఁడును గృష్ణుని దుష్టజనదండధరావతారుండైన శ్రీహరిఁగాఁదలపోసి కంఠగత ప్రాణుఁడై శ్రీకృష్ణపరమాత్మను రక్షింపుమని ప్రార్థింపఁ దొడంగెను. ఆసమయంబునఁ గాళీయుని భార్యలైన నాగాంగనలు తమ ప్రాణనాథునకుఁ గలిగిన ప్రాణోపద్రవమునకు మిక్కిలిగఁ బరితపించుచుఁ శ్రీహరిఁజేరంజని కరంబులుమోడ్చి "కృష్ణా! మాకుఁ బతిభిక్షఁ బెట్టుము. మానాథుఁడు సర్వచరాచర భూతేశుండవైన నీతత్వంబు నెఱుంగఁజాలక యజ్ఞానంబున నీకపచారంబుఁ గావించె. దేవా! నిన్నుజయించువారెవ్వరు

గలరు? అగోచరుండవయ్యును గోచరుండవగుచుంటివి. నిరాకారుండవయ్యు ననంతాకారుండ వగుచుంటివి. నిర్విశిష్టుండవయ్యును విశిష్టుండవగుచుంటివి. నిర్విశేషుండ వయ్యును విశేషుండవగుచుంటివి. రూపరహితుండవయ్యును నానారూపసమన్వితుండ వగుచుంటివి. అనామకుండవయ్యును బెక్కునామంబులుగలవాడ వగుచుంటివి. ఒక్కండవయ్యును సర్వంబు నీవయగుచుంటివి. విశ్వంబునీవయయ్యును, నీవు విశ్వంబుగాకుంటివి. నిర్గుణుండవయ్యును గుణాచ్ఛాదకుండ వగుచుంటివి. ఆత్మారామత్వంబువలన మునివయ్యును హ్రస్వదీర్ఘస్థూలసూక్ష్మములకుఁ గారణభూతుండవగుచుంటివి. మహాత్మా! విశ్వభావాభావసందర్శనంబుసేయుచు విద్యావిద్యలకుఁ

కాళీయుని భార్యలు కృష్ణుని స్తుతించుట.

గారణుండవైన నిన్నెవ్వరెఱుంగఁగలరు? సృష్టిస్థితిలయములకునీమూర్తియేమూలకారణము. నీమహాత్మ్యమక్షోభ్యము. బ్రహ్మాదిదేవతలకే నీతత్వంబనిర్వాచ్యంబు. శ్రీకృష్ణా! మాకాంతుని రక్షించి మాకుఁ బతిభిక్షఁబెట్టు' మని యనేకవిధంబులఁ బ్రార్థింపఁ గృష్ణుండును భక్తపాలకుండుగావునఁ గాళీయుని ప్రాణంబులఁగాపాడి, తన్నుఁ బ్రార్థించుచున్న సర్పరాజునుగాంచి "ఓయీ! నిన్ను రక్షించితిని. నీవిప్పుడే నీదారాపుత్రాదులతో బయలుదేరి సముద్రమునకుఁబోయి యచ్చోట వసింపుము. నీశిరంబున మదీయ

పాదచిహ్నంబులుండుటవలనఁ బక్షివల్లభుఁ డెంతమాత్రమును నిన్ను బాధింపఁడు. ఇప్పుడేపొమ్మని యానతిచ్చి, కాళిందీ నదీతోయంబు లప్పటినుండి జనోపయోగ్యంబులగునట్లు వరం బొసంగి, యొద్దునఁ దనకై వేచియున్న జననీజనకులను బంధు జనులను జేరంజనెను. కృష్ణుండట్లు సురక్షితంబుగాఁదమ్ముఁ జేరినంతనే యాదవులందఱును మహానందముతో మాటి మాటికిఁ గృష్ణునిఁ గౌఁగలించుకొనుచు నాతని యమానుష చర్యలను బొగడుచు నిజనివాసంబులకరిగిరి.

కృష్ణుఁడట్లు కాళీయుని శిక్షించి సురక్షితముగా నంద గోకులమును బ్రవేశించిన కొన్నినాళ్లకు నందాదు లింద్ర యాగంబును సేయఁదలంచి తద్వృత్తాంతంబు నంతయుఁ గృష్ణునకుఁ దెలియఁజేసి 'నీయభిప్రాయమేమి' యని యాతని నడిగిరి. అప్పుడాతఁడు వారిఁగూర్చి 'ఇంద్రయాగంబును మీరేల సేయవలయు?' నని ప్రశ్నించెను. అందుకు నందా దులు బురుహూతునకుఁ బ్రియంబుగా యాగంబు నొనర్చిన నాతండు సంతోషించి వానలు గురియించుననియు, వానల వలన వసుమతియందుఁ గసవు పెరుగుననియుఁ గసవువలన గోగణంబులు వృద్ధిసెందుననియు, వానివలన వలసినంతపాడి తమకు లభించుననియు. నందువలనఁ దమ కులంబంతయు సకలసంపదలతో విరాజిల్లుననియుఁ గావున నింద్రయాగంబు

సేయ సమకట్టితి మనియుఁ దెలియజేసిరి.

కృష్ణుని కర్మప్రబోధము

అప్పుడు కృష్ణుఁడు వారినిఁ గాంచి "బంధువులారా! ఇంద్రునివలన మనము పెంపువహింపనేల? ఆతండు మనకెంతమాత్రమును గర్త కానేరఁడు. కర్మయే యన్నింటికిఁ బ్రధాన మగుచున్నది. కర్మవలననే జననమరణంబులును, వృద్ధిక్షయంబులును శరీరధారులకుఁ గలుగుచున్నవి. అట్టియెడ నింద్రుని మనమెందుకుఁ బూజింపవలయును. ఇంద్రుఁడైనను గర్మకు లోఁబడినవాఁడే. ఆతఁడుకర్మఫలమును బోఁగొట్టజాలఁడు. ఉత్పత్తిస్థితి లయంబులకు సత్వరజస్తమో గుణంబులు ప్రధానంబు లగుచున్నవి. రజంబున జగంబు జన్మించును. రజోగుణ ప్రేరితంబులై మేఘంబులు వర్షించు. అట్టి వర్షంబువలన మీరు వ్రాకుచ్చినదంతయు సమకూరును. అప్పుడు ప్రజావృద్ధియగును. కావున నింద్రయాగంబుతో నిమిత్తంబులేదు. కర్మంబు ననుసరించి ప్రజావృద్ధికిఁ బసులకుఁ గొండకు, బ్రాహ్మణోత్తములకుఁ బూజలు గావించుట సమంజసము. కావున మీరందఱును గోవర్ధన పర్వతంబును బూజింపుఁడు. దానివలననే మనకన్నియును సమకూరగల" వనిపల్కెను. యాదవులును గృష్ణునిహితంబు ననుసరించి హరిసమేతులై గోవర్ధనగిరికిఁ బూజలుసేసి భూసురాశీర్వాదంబులతోఁ బర్వతంబునకుఁ బ్రదక్షిణపూర్వక సమ

స్కారంబు లొనర్చి గోవులను బురస్కరించుకొని గృహంబుల కరిగిరి.

కృష్ణుని హితంబును బాటించి గోపకులు తన్నుమఱచి నారని యింద్రుఁడు కోపించినవాఁడై వారికి బుద్ధి సెప్పఁ దలంచి మేఘంబులఁ బురస్కరించుకొని సకలభువనంబులు కంపించునట్లు, పిడుగులతోఁ గూడిన శిలావర్షమును నందగోకులంబుపైఁ గురియింప సాగెను. ఆప్రచండ శిలావర్ష విజృంభణంబునకు గోపకులు వెఱచి హాహాకారంబులు సేయుచు "కృష్ణా! రక్షింపుము. రక్షింపుము" అని మొరలిడసాగిరి. కృష్ణుండును వాసవుని యఖండగర్వంబును బోఁగొట్టఁ దలంచి, యపాయంబు లేదని బంధుజనుల హెచ్చరించుచు, సకలలోకంబులు తన్నుగీర్తించునట్లు, గోవర్ధనంబు నవలీలఁగానెత్తి ఛత్రంబు పగిదిఁ గొనవ్రేలియందు నిలిపినవాఁడై, రక్షణోపాయంబుఁ గానక విలపించుచున్న నందగోకులంబును గాంచి 'బంధువులారా! ఎంతమాత్రమును భయపడవలదు. ఇదిగో! ఈకొండక్రిందికి రండు, ఇదియే మిమ్మును, మీదారాపుత్రాదులను, మీగోగణంబులను, గొడుగువలె నెగడి శిలావర్షంబు నుండి రక్షింపఁగలదు. మఱియు నోబంధువులారా!

శా. బాలుం డీతఁడు కొండ దొడ్డది మహా ♦ భారంబు వైరింపఁగాఁ
జాలండో యని దీనిక్రింద నిలువక ♦ శంకింపఁగాఁబోల దీ

శైలాంభోనిధిజంతుసంయుత ధరా • చక్రంబు పైఁబడ్డ నా
కేల్లల్లాడదు బంధులార నిలుఁడీ • క్రిందం బ్రమోదంబునన్.

అని హెచ్చరించి ధైర్యంబుసెప్ప వారివచనంబులనమ్మి తమ తమ గోధన పుత్రమిత్రకళత్రాది సమేతులై యాదవులాకొండ గొడుగు చాటున నిలచిరి. ఇంద్రుండును నేడహోరాత్రంబులు శిలావర్షమును గురియించియు గోపకులను శిక్షింపఁ జాలక మేఘంబుల మరలించుకొని పోయెను. వర్షమాగినతోడనే కృష్ణుండును బంధువుల వెలుపలి కంపి పర్వతంబు నెప్పటియట్లుంచి గోపకులను గలిసికొనెను. తమ ప్రాణరక్షణం బొనర్చిన బాలకృష్ణుని వల్లవులెల్లఁ గౌఁగలించుకొని సముచితప్రకారంబుల సంభావించి దీవెన లొసంగిరి. అచ్చోట వాసవుండు కృష్ణుని సామాన్యునిగాఁ దలంచి తానొనర్చిన పనికి లజ్జించుచు శ్రీహరిఁ జేరంజని తన తప్పును క్షమింపుమని యనేకవిధంబులఁ బ్రార్థించెను. కృష్ణుండును దగిన విధంబున నింద్రునకు బుద్ధిసెప్పి యెదిరిబలంబు నెఱుంగక యెన్నండును గయ్యంబునకుఁ గాలుదువ్వకుమా యని హెచ్చరించి యాతనిని వీడ్కొలిపెను. యాదవప్రముఖు లందఱును గృష్ణుని లీలామానుషచర్యలను బదింబదిగఁ దలంచుచు నాతనియందు మిగుల భక్తిఁ గలిగి యుండిరి.

(గోవర్ధనగిరి నెత్తుట ఇంద్రుడు క్షమింపబడుట)

# ౭

బలరామకృష్ణుల యసమాన శౌర్యపరాక్రమక్రమ విశేషంబులు భూనభోంతరాళంబులఁ బ్రతిధ్వను లీనుచుండ మధురాపురంబునఁ గంసుండు రేయింబవలు నిద్రాహారంబుల మాని బలరామకృష్ణుల వధోద్యోగంబును గూర్చియే పెక్కుభంగులఁ జింతింపఁ దొడంగెను. తానొనర్చిన ప్రయత్నంబులన్నియు నిష్ఫలంబు లగుటవలనఁ గపటోపాయంబున వారల నెవ్విధినైన నిజపురంబునకు వచ్చునట్లొనర్చి మట్టుపెట్టవలయునని తుదకు నిశ్చయించుకొని వారలను మధురాపురంబునకుఁ గొనివచ్చుటకై యక్రూరుండను వానిని బృందావనంబునకుఁ బంపెను.

అక్రూరుడు బృందావనమునకు వచ్చుట.

అక్రూరుండును శ్రీహరినిఁ గనులారఁ జూచు భాగ్యంబు తనకు లభించినందుకు జన్మంబు సార్థకంబయ్యెనని తలపోయుచుఁ గృష్ణుని లీలలఁగూర్చి యనేకవిధంబులఁ దనలోఁ దాను భాషించుకొనుచుఁ గ్రూరుండగు కంసుని పంపునఁ దానరుగుచున్న వాఁడగుటవలనఁ దన్నుఁ దంషు వేఱుగా భావించి కరుణింపఁడేమోయని శంకించుచు, భక్తపాలకుండగు హరి, యతని పదకమలయుగళసేవాపరాయణుండగు తన్నేల కనికరింపకుండునని తనకుఁ దానే ధైర్యంబు సెప్పికొనుచు, సకలభూతాంతర్బహిర్మధ్య సంగతుండగు కృష్ణుండు తన నిజ

స్వభావమును గుర్తింప నేరఁడాయని తర్కించుకొనుచు నిట్టి ధంబునగతిపయదివసంబులు ప్రయాణంబు నొనర్చి, యచిర కాలంబుననే చందనకుందకుటజతాలసాలకురవకవటమాకంద తరుపరిశోభితంబగు బృందావనంబును జేరి యందుఁ బ్రవేశించి శ్రీకృష్ణ బలరామ బాహుదండ ప్రాకార రక్షావిశేష భూషంబైన ఘోషంబున నొక్క దెసఁగల నందుని మందిరంబును జొచ్చి యందు మందహాసరుచిరోదంచితవదనార విందుఁడగు నగవిందదళాక్షుని సందర్శించెను.

అక్రూరుండట్లు తన్ను సందర్శించినంతనే కృష్ణుండాతని కెదురేగి తోడ్కొనివచ్చి సముచిత ప్రకారంబుల నర్ఘ్య పాద్యాదివిధులఁ బూజించి సుఖాసీనుఁగా నొనర్చి కుశల ప్రశ్నమడిగెను. అక్రూరుండును దనువునఁ బులకాంకురంబులు ముమ్మరంబుగ మల్లడిఁగొన నానందబాష్పపూరిత నేత్రుం డగుచుఁ గృష్ణుఁ బెక్కు తెఱంగులఁ గొనియాడి యచ్చోట నున్న నందాది ప్రముఖులైన యాదవులందఱును వినునట్లు దాను వచ్చిన కార్యముఁ గూర్చి కృష్ణబలరాములతో "మహా

అక్రూరుడు తానువచ్చిన కార్యమునుగూర్చి కృష్ణునకుఁ దెలుపుట.

త్ములారా! క్రూరాత్ముండును, మీకు మామయును నగు కంసుం డిప్పుడు ధనుర్యాగంబు సేయనున్నవాఁడు. అట్టి శుభకార్యమునకు మిమ్ముఁ దోడ్కొనిరమ్మని నన్ననుప మిమ్ముఁ గొనిపోవుటకై

నే నిచ్చోటి కరుదెంచితిని. కాని యిందేమో మోసంబుగల దని నాకుఁ దోచుచున్నది. ఐనను సర్వజ్ఞులరగు మీకుఁ దెలియనిదేమియును లేదు. మీయిష్టానుసారము వర్తించెద' నని తెలియఁజెప్పఁ గృష్ణుండును నగుచు స్వజనంబులఁగాంచి 'బంధువులారా! నేఁడే మీరందఱును దగిన కానుకలఁ గొని మధురాపురంబున కరుగుఁడు. మే మక్రూరునితో రేపు బయలుదేఱి మిమ్మందఱ నచ్చోటఁ గలిసికొనెదము. యాగమునకుఁ బిలువఁబడకయే యరుగుట శాస్త్రసమ్మతము. అట్టియెడఁ బిలువంబడియుఁ బోకుండుట మంచిది కాదు. కావున మీరిప్పుడే బయలుదేరి పొం'డని పలుక వారును వల్లెయని తమ శక్తికిఁ దగినట్లు కానుకలఁగొని శకటారోహణం బొనర్చి యప్పుడే మధురాపురంబున కరిగిరి.

మఱునాటి యుదయమునఁ దనవియోగంబునకు సహింపఁజాలక మధురానగరంబున కరుగవలదని తన్ను నిరోధించు వల్లవీజనంబులఁ దాను దిరిగివచ్చెదనని యనేకవిధంబుల నూరడించి బలభద్ర సమేతుండై యక్రూర చోదితంబైన మణిస్యందనంబు నెక్కి శ్రీకృష్ణుండు మధురాభిముఖుండై యరిగెను. అట్లు చనుసమయంబున మధ్యేమార్గంబునఁ గాళిందీ నదియొద్ద స్యందనంబు నిలిపి యన్నతోఁ గృష్ణుండు తన్మధుర సలిలపానంబొనర్చి కొంత

కాళిందియందు రామకృష్ణులనక్రూరుండు గాంచుట.

తడవు తత్సమీప తరుచ్ఛాయాశీతలసికతాతలంబున విశ్రమించి తిరిగి రథంబును బ్రవేశించెను. అట్టియెడ నక్రూరుండు స్నానంబుసేయ నిచ్ఛగించి రథంబునఁ గృష్ణబలభద్రుల భద్రంబుగా నుండజేసి నదిఁజొచ్చెను. అందాతఁడు జలంబుల మునింగి స్నానంబుసేయుచుండఁ దన్నదీతోయగర్భంబున బలభద్ర ద్వితీయుండైన శ్రీకృష్ణ పరమాత్మ యాతనికిఁ బ్రత్యక్షమయ్యెను. ఇదియేమో యని విస్మయంబునొంది యాతండు లేచి రథంబువంకఁ దిలకింప శ్రీకృష్ణ బలభద్రులు రథంబునందే యుండిరి. తిరిగి యాతండు జలంబుల మునింగినంతనే క్షీర సాగర శయనుండైన శ్రీమహావిష్ణుమూర్తి యాతనికిఁ గానంబడి యెను. అప్పుడక్రూరుండు కృష్ణుండు కేవలము పరమాత్మ స్వరూపుండనియు, బలభద్రుండాదిశేషుండనియు నెఱింగి భక్తిపారవశ్యంబున నామహాత్ములఁ బ్రస్తుతించుచు మేను మఱచియుండఁ గృష్ణుండాతనిఁ బ్రొద్దాయెనని హెచ్చరించెను. అక్రూరుండప్పటికిఁ దెలివినొంది జలంబులనుండి వెలువడి రథంబు నధిరోహించి బలరామకృష్ణుల ననేకవిధంబులఁ గీర్తించుచుఁ బ్రొద్దుగ్రుంకువఱకు మధురానగరంబును సమీపించు నట్లు రథంబును నడిపెను. కృష్ణుండును బలరామునితోఁ బురంబువెలుపలనే యురదంబునుండి డిగ్గియక్రూరుని వీడ్కొలిపి, పురోపవనంబునఁ దనరాకకై యెదురు సూచుచున్న బంధువులఁ జేరంజనియెను.

తెల్లవారినదే తడవుగా శ్రీకృష్ణబలభద్రులు కాల్యకృత్యంబుల నిర్వర్తించుకొని మధురానగరప్రవేశ మొనర్చిరి. అట్టియెడ రజకుం డొక్కరుండు భూపరిపాలకోచితంబులగు దుకూలంబులఁగొని యెదురు సనుదెంచుచుండఁ గృష్ణుండు వానిఁ గని యావస్త్రంబులఁ దమ కిమ్మని యడిగెను. ఆతండును దుర్మదావివేకంబున నగుచు 'ఏమీ! వెఱ్ఱిగొల్లలకుఁగూడ దుకూలంబులు గావలయునా? యని పరిహాసం బొనర్చెను. అంతఁ గృష్ణుండాతనిపైఁ గినుక వహించి పిడికిట నాతని శిరంబు పగులఁజేసి యాతని యొద్దనున్న పట్టువస్త్రంబులఁ గొని తానును బలభద్రుండును ధరించుకొనిరి. నూతనవస్త్రధారణంబున నినుమడించిన మోహనాకారంబుతో నరుగుచున్న కృష్ణునిఁ గాంచి పౌరకాంతలు 'ఆహా! ఈ సుందరాకారునితోఁ గలసి క్రీడించుటకు గోపికలెట్టినోములునోచికొనిరో కదా!' యని తమ్ముఁ గూర్చి నిందించుకొనఁజొచ్చిరి. పురుషులగువారును, నాతని మోహనాకారంబునకుఁ దన్మయులగుచు నాతని యమానుష తేజోవిశేషంబులఁగూర్చియుఁ బనులఁగూర్చియుఁ బలువిధంబులఁ దలంపసాగిరి. బలరామకృష్ణులట్లు గొంతదవ్వరుగునప్పటికి వాయకుండొక్కండు వారలకెదురువచ్చి భక్తిపూర్వకంబుగా నమస్కరించి మిక్కిలి మనోహరంబులగు వస్త్రంబు

మధురానగర ప్రవేశము.

పౌరజనాభిప్రాయము.

లను, విలువఁగల భూషణంబులను సమర్పించెను. కృష్ణుండును వానిఁ గైకొని యాతనియెడఁ గరుణవహించినవాఁడై యాతం

వాయకుని గరుణించుట.

డొనర్చినయంతమాత్రపుఁబనికే యాతనికి నైశ్వర్యములు గలుగునట్లు వరంబొసంగెను. అచ్చోటునువాసి మఱి కొంతదవ్వరుగునప్పటికి సుదాముండను నొక మాలాకారుం డెదురుసను దెంచి వినయపూర్వకంబుగా రామకృష్ణులకు దివ్య

సుదాముని కరుణించుట.

ములైన సురభి కుసుమదామములను సమర్పించెను. ఆపనికిఁ గృష్ణుఁడు సంతసించి 'ఏమివలయునో కోరుకొనుము. ఇచ్చెద' నని యాతనితోఁ బలుక నమ్మాలికుండును గరంబులు మోడ్చి 'మహాత్మా! నాకితరంబు లేవియును వలదు. నాకువలయున దేమనఁగా.

'కం॥ నీపాదకమల సేవయు
నీపాదార్చకులతోడి । నెయ్యము నితాం
తాపారభూతదయయును
దాపసమందార నాకు । దయసేయఁగదే!'

అని వేడికొనఁ గృష్ణుండట్లకాకయని వెండియు నాతనికి బలాయుః కాంతికీర్తి సంపదల నొసంగి యగ్రజునితో ముందునకరిగెను. అట్టియెడఁ గుబ్జయను కంసుని దాసియొక్క[illegible] విలేపనంబులఁగొని రాజభవనంబున కరుగుచుండఁ గృష్ణుం[illegible] దాసిని సమీపించి 'ఓసుందరాంగీ! మాకుఁ బూఁత విలేప[illegible]

బుల నొసంగెదవా?' యనియడుగఁ గుబ్జయు "ఓసుందరా కారా! కుబ్జనగు నన్ను సుందరాంగియని యెందుకుఁ బరిహ సించెదవు? ఇవిగో విలేపనంబులఁ గొను' మని ప్రేమపూర్వకంబుగా నొసంగెను. కృష్ణుండును హాసినందుకొని తాను నుడివినవాక్యము వృథకాగూడదని యామెను సుందరాంగిగాఁ జేయఁదలంచి, దాని పాదంబులను దనచరణంబులతోఁ ద్రొక్కిపట్టి, హస్తాంగుళద్వయము నబలగవుద క్రిందనునిచి మీదికినొత్తి వక్రస్వరూపంబును జక్కఁజేసి యాకాంతను గేవలము మోహినీదేవతగా నొనర్చెను. కుబ్జయుఁ దనసౌందర్యంబునకుఁ దానే యాశ్చర్యపడినదై, మోహనాకారుండగు కృష్ణునిపై మోహంబునుగొని కామభిక్షఁబెట్టుమని యాతనిఁ బ్రార్థించెను. కృష్ణుండును, నాకామినికోర్కె తరువాత సఫలతఁ బొందుననని వరం బొసంగి, యవ్విధంబున దన్నునమ్మినవారినిఁ గరుణించుచుఁ గొంతవడికుఁ బురంబును గలయందిరిగిఁ నాటికిఁ బురవిహారంబు సాలించి యన్నతో వెడలి విడిదలకుఁజని తనవారలఁ గలిసికొనెను.

కుబ్జను సుందరాంగిగా నొనర్చుట.

తన పురంబునందే కృష్ణుండొనర్చిన యద్భుతకార్యంబులకుఁ గంసుఁడు వెఱఁగంది యాలసించుట యెంతమాత్రమును దగదని మఱుచటి యుదయముననే నందాదులను గృష్ణ

బలరాములను సభాభవనంబున కాహ్వానించెను. నందాదులు ముందరుగ బలభద్రకృష్ణులు వెనుకనరిగిరి. కృష్ణబలరాములు

కువలయాపీడమను గజంబును కృష్ణుండు సంహరించుట

సభామంటప ద్వారప్రవేశం బొనర్చునెడ నాకస్మికంబుగాఁ గువలయాపీడమను మదగజంబొండు నిజపరిపాలక ప్రేరేపితంబై కృష్ణునిపైఁ గవిసెను. కృష్ణుండు నీవణ్మాత్రమేనియుఁ జలింపక తనపైకిఁ బరతెంచుచున్న యాగంధ నాగంబున కెదురునడచి హార్యకుంబు వదువ్రన నవలీలదానిపైకిలంఘించి దనుజ మస్తకవిదారితంబగు హస్తంబునఁ దదీయ కుంభస్థలంబు వగులునట్లు చఱచెను. ఆముష్టిఘాతంబునకది తెలివిఁదప్పి ధరణిపైనొరగి నెత్తురులు గ్రక్కుచుఁ గొండొకతడవునకుఁ బ్రాణంబులఁ బాసెను. అట్లామదగజంబును గనురెప్పపాటు కాలంబుననే హతంబొనర్చి దాని దంతంబులనూడఁబెఱికి యన్నయుఁ దానును వానినే యాయుధంబులుగాఁ గైకొని భీకరాకారముతో బలభద్ర ద్వితీయుండై సభాభవనంబును బ్రవేశించెను. అప్పటి శ్రీకృష్ణబలరాముల రౌద్రాకారములఁ గాంచి కంసుఁడు గడగడ వడకసాగెను. అట్టియెడఁ

చాణూరముష్టికుల వధ.

జాణూర ముష్టికులను మల్లులిద్దఱు దమనాథునకుఁ బ్రియంబు సేయఁదలంచి, శ్రీకృష్ణ బలరాములను గొంతతడవు తమతో మల్లయుద్ధమునుసల్పుట కాహ్వానించిరి. పిలువఁబడినప్పుడు వెను

దీయుట వీరలక్షణంబుగాదని కృష్ణుండు చాణూరుని, బలుండు ముష్టికుని మార్కొని మల్లయుద్ధమొనర్పసాగిరి. నందాదులు తమపుత్రుల కేమిహానిగలుగునోయని దిగుల్పడసాగిరి. ప్రేక్షకులందఱును బెక్కు మల్ల యుద్ధంబులం దారితేరిన చాణూర ముష్టికులను గేవలము పసివారగు యాదవ కుమారులపైఁ బురికొల్పుట చాలయన్యాయమని కంసునిదూషింపసాగిరి. కంసుఁడు దనమల్లసింహంబులవలన గోపాలకుంజరంబులు మడియుట నిక్కమని తలంపసాగెను. అట్టియెడఁ గృష్ణ బలభద్రులు తమ్ము మార్కొనిన యామల్లులను విచిత్రగతుల నొప్పించి చూచువారాశ్చర్యపడునట్లును, గంసుఁడు హతాశుఁడగునట్లును, వారిని బంచత్వంబునొందించి భీషణంబుగ సింహనాదంబులు సేసిరి.

పేరువడిన చాణూరముష్టికులు మడిసినంతనే కంసుఁడు తత్తరంబున నిజభటులఁజూచి 'భటులారా! చూచెదరేల? యాదవులనందఱినిబట్టినుగ్గాడుఁడు. దేవకీవసుదేవులప్రాణంబుల హరింపుఁడు. నాకుఁ దండ్రియయ్యు నాపై శత్రుత్వము వహించియున్న యుగ్రసేనుఁబట్టి ముక్కలు ముక్కలుగాఁ గోయుఁడు. లెండు. మార్కొనుఁ' డని హెచ్చరించినంతనే రక్కసభటులుక్కుమిగిలి యాదవులపై విజృంభించిరి. అట్టి యెడ బలుఁడొక్కరుండే యాదానవభటసంఘంబుల నెను

ర్కొని గుట్టలు గుట్టలుగాఁ గూల్పసాగెను. అంతఁగృష్ణుండు రణోల్లాసంబుల్లంబున మల్లడిఁగొన నెల్లరుఁ దెల్లవోవ సింహంబు పిల్లవలెఁ గంస భూవల్లభునిపైకి లంఘించి కేశబంధంబువట్టి యవలీలగఁ గ్రిందఁ బడవైచి యాతని యురంబునందిరంబుగ నాసీనుండై దైత్యభటసంఘాతంబులు తల్లడిల్లునట్లు సకలలోకంబులు సంతసించునట్లు 'ఓరీ శిశుహంతకా! నీపాపఫలంబిప్పుడే యనుభవింపఁగల" వని కంసునిఁగూర్చి పలుకుచు వజ్రసన్నిభంబగు తన పిడికిట నాతనిఱొమ్ము పగులునట్లు పొడిచి విగతజీవునిఁగా నొనర్చెను, అట్టియెడ దేవతలందఱును గృష్ణునిపైఁ బువ్వులవానఁగురియించిరి. అప్సరసలు నాట్యమాడిరి. దేవదుందుభులు మ్రోగెను. మఱియు నయ్యవసరంబున—

కంసవధ.

క॥ చేతులఁ దాళములొత్తుచుఁ
జేతోమోదంబుతోడ • సిగముడివీడం
బాతరలాడుచు మింటను
గీతము నారదుఁడు వాడెఁ • గృష్ణాయనుచున్.

కృష్ణుండు కంసవధంబు నొనర్చుసరికి బలభద్రుండును దన్నెదుర్కొనిన దైత్యులనందఱిని రూపుమాపెను. ఆగోపబాలకుల యసమాన శౌర్యధైర్య పరాక్రమ తేజోవిశేషంబులకు రక్కసులు భయపడి తలకొక దిక్కువంతునఁ బాఱిపోయిరి. శత్రుసంహారము సంపూర్తి నొందుటవలన బలభద్ర

కృష్ణులు కారాగారంబుననున్న తమతల్లిదండ్రుల—దేవకీవసుదేవుల—సందర్శించుట కరిగిరి. దేవకీవసుదేవులును దమపుత్రులఁ గాంచినంతనే శరీరంబులుప్పొంగఁ గౌఁగిటఁజేర్చి ముద్దాడఁ దొడంగిరి. కృష్ణుండును దల్లిదండ్రుల బంధవిముక్తులుగా నొనర్చి, తమవలన వారికిఁ గలిగిన కష్టంబులకుఁ దమ్ముక్షమింప వలసిన దని ప్రార్థించెను. లీలామానుష విగ్రహుండైన శ్రీహరి తమ్ము క్షమాపణంబును వేడినంతనే దేవకీవసుదేవులు మోహితులై కుమారుల నిజాంకపీఠంబుల నిడికొని వారివదనంబులఁ దమ వేడికన్నీటితోఁ దడుపసాగిరి. అట్టియెడఁ గృష్ణుండు మాతామహుండైన యుగ్రసేనుని రావించి, వినయపూర్వక నమస్కారంబు నొనర్చి, 'తాతా! పుణ్యపురుషుఁడవైన నీవిప్పుడే సింహాసనంబు నధిష్టించి రాజ్యపరిపాలన మొనర్పు' మని పల్కుచు నప్పుడే యాతనిని రాజుగానొనర్చెను. అనంతరము, మున్ను కంసునకు భయపడి పరదేశంబుల కరిగియున్న యదు వృష్టిభోజమరుదశారకుకురాంధక ప్రముఖులగు సకలజ్ఞాతి సంబంధులను రావించి వారివారి నివాసంబుల నునిచి యివ్విధంబున సర్వంబును గాపాడెను.

బంధుజన సంరక్షణము.



## ౮

కంసవధానంతరము బలరామకృష్ణులు, బృందావనంబునకరుగక, తల్లిదండ్రులను, మాతామహుని సేవించుచు మధురాపురంబునందే నిలచియుండిరి. వసుదేవుండును కుమారులకుఁ దగినవయస్సు వచ్చియున్నందువలన శాస్త్రసమ్మతంబగు నొక శుభముహూర్తంబు నేర్పరచి, యుపనయన సంస్కారంబును నిర్వర్తించెను. బ్రాహ్మణులకు సదక్షిణంబులుగా ననేక గోభూహిరణ్యాదానంబులను, కుమారుల జన్మసమయంబున మనోదత్తలైన గోవులను, మిక్కిలి విలువఁగల మణిమయ దుకూలంబులను మున్నగువాని నొసంగి సకలభూతంబులనుసంతసింపఁజేసెను.

రామకృష్ణుల ఉపనయనము, విద్యాభ్యాసము.

కృష్ణుండును దనకుపనయనాది సంస్కారంబులు సలుపఁబడినంతనే, తాను సర్వవిదుండయ్యు నెంతవారికేని గురుశుశ్రూషయనునది యుండితీరవలయుననుదానిని నిరూపింపఁదలచి సాందీపమహామునియొద్ద గురుశుశ్రూష సేయుచు విద్యాభ్యాసమునకుఁ గడంగెను. అచిరకాలముననే సర్వశాస్త్రేతిహాస చతుర్వేదవిజ్ఞాన పరిపూర్ణుండై గురువనుమతిని గృహస్థాశ్రమంబును స్వీకరింపఁ దలంచి స్వగృహంబునకరిగెను. బలభద్రుండును వేఱొక

గురూత్తమునికడ విద్యాభ్యాసంబును ముగించుకొని మథురా నగరంబునకుఁ దిరిగివచ్చెను. ఇవ్విధంబున రామకృష్ణులు సకలవిద్యాపరిపూర్ణులై గృహస్థాశ్రమ స్వీకారంబునకుఁ దగిన యీడును గలిగినవారై యుండిరి.

కంసుఁడు కృష్ణునివలన మడిసినాఁడనువార్త యెల్లెడలఁ దెలియవచ్చినంతనే యాతని బంధుజనులందఱును గృష్ణునిపైఁ బ్రబల శత్రుత్వమును వహించియుండిరి. అట్టివారియందు మగధ దేశాధీశుఁడగు జరాసంధుఁడనువాఁడు ముఖ్యుఁడై యుండెను. జరాసంధుఁడును మిక్కిలి బలపరాక్రమములు గలవాఁడగుటవలనను, దనకుఁ గృష్ణునివలనఁ జావులేనివాఁడగుటవలనను, గంసునిమరణంబునుగూర్చి కృష్ణునిపైఁ గత్తి కట్టియున్నవారి కందఱికిని దాను నాయకుండై రామకృష్ణులు గురుకులవాసంబొనర్చుచున్న సమయంబున మధురాపురంబుపై దాడివెడలి, కృష్ణుని స్వజనంబులను బెక్కువిధంబుల బాధించెను.

ద్వారకానగర నిర్మాణము.

రామకృష్ణులు తిరిగి మధురానగరంబునకు వచ్చియున్నప్పుడుగూడ, జరాసంధుఁడు పెక్కు మారులు దండెత్తివచ్చెను. రామకృష్ణులు, తమవలన నాతనికి మృత్యువులేకున్నందువలన నాతనివలన నెట్టి బాధలును గలుగకుండ బంధుజనులను గాపాడుచుండిరి. కాని జరాసంధుఁడు మాటిమాటికి దండెత్తి

వచ్చుచుఁ బురజనులకశాంతిని జేకూర్చుచుండెను. అందు వలనఁ గృష్ణుండు జరాసంధుని బారినుండి స్వజనుల రక్షింపఁ దలంచి, దుర్జనులకు దుర్గమంబును, సుజనులకుసుగమ్యంబును, నైయుండునట్లు సముద్రంబు మధ్య ద్వారకయను నొకపురం బును నిర్మింపఁజేసి తనబంధుజనుల నందఱి నందుఁజేర్చి జరా సంధునివలన శాంతిభంగ మొదవకుండునట్లొనర్చెను. నలు ప్రక్కల జలరాశియే యగడ్తగాఁగల ద్వారకానగరంబును సమీపించుటకేనియుఁ జాలనివాఁడై జరాసంధుఁడంతటితోఁ దన దండయాత్రలను ముగించెను. కృష్ణుఁడును ద్వారకా నగరంబునందుండి సురక్షితులైయుండునట్లు బంధుజనులఁ బరి పాలింపఁ దొడంగెను. జరాసంధాదులకప్పటికి శ్రీకృష్ణుండు కేవలము మనుష్యమాత్రుండుగాడను వృత్తాంతము సర్వం బును జక్కఁగా బోధపడెను. కాని శత్రుత్వ మెంతమాత్ర మును నశింపలేదు.

సముద్రమే పరిఖగాఁగల ద్వారకానగరంబున యాద వులందఱును సురక్షితులై యుండిరి. వసుదేవుండు తనపెద్ద కొడుకైన రామునకు వివాహంబు సేయఁదలంచి కన్యాన్వేష ణంబునకు భూసురుల నియోగించెను. వారును సకలదేశం బులు గలయఁదిరిగి తుదకు రైవతుఁడను నొక మండలేశ్వరుని పుత్రికయైన రేవతియను కన్యను రామునకుఁ దగినదని నిశ్చయించుకొని

బలరాముని వివాహము

వచ్చిరి. రైవతుండును దనపుత్రికను రామునకిచ్చునట్లు బ్రహ్మ దేవునిచేఁ దెలుపఁబడినవాఁడై వసుదేవునకు శుభ లేఖనంపెను. వసుదేవుండును నాప్తబంధు పుత్రమిత్రపురోహితకళత్రాదివర్గం బులతోఁ దరలివెళ్లి యొక్క శుభముహూర్తంబున రామునకు వివాహ సంస్కారంబును ముగించెను. రాముండును రేవతి తోడ ననుకూల దాంపత్యమును నెఱపుచు నామెయందు శశిరేఖయను పుత్రికారత్నమును బడసెను. ఆబాలామణియు దినదినాభివృద్ధినొందుచు సకలసద్గుణంబుల కాలవాలంబగుచు జననీజనకులకేగాక సమస్తజనులకును ముదమును గూర్చు చుండెను. అట్టి పుత్రికారత్నమును బలరాముఁడు తనకు మేన ల్లుండును, సుభద్రార్జునులకు ముద్దుపట్టియునగు నభిమన్యున కిచ్చి వివాహంబు గావించెను.

బలరాముండట్లు రేవతీసహితుండై కాపురంబుసేయు చుండఁ గృష్ణునకుఁగూడ వివాహంబు సేయవలయునని వసు దేవుండు చింతింపసాగెను. కాని శ్రీహరి స్వరూపుండైన తన కుమారునకు లక్ష్మీస్వరూపురాలైన కన్యకామణి యెచ్చోటలభించునాయని వసుదేవుండు మిక్కిలిగవిచారింపఁ దొడంగెను. ద్వారకానగరవృత్తాంతంబిట్లుండ నచ్చోటవిదర్భ దేశంబునకు రాజధానియైన కుండినగరంబున భీష్మకుం డను నొక దొడ్డరాజునకు లక్ష్మీదేవి యంశంబున జనించిన

రుక్మిణీదేవిచరిత్రము.

రుక్మిణియను బాలామణి శ్రీహరిని భర్తగాఁ బడయవలయునని యాలోచింపసాగెను. భీష్మకుండును నారదాది మహామునీంద్రులవలన శ్రీకృష్ణుని యొక్కయుఁ దనపుత్రికయొక్కయు నిజ చరిత్రంబుల నెఱిఁగినవాఁడై తనబిడ్డను వసుదేవనందనునకొసంగ వలయునని నిశ్చయించుకొనెను. కాని యాతని పెద్దకొడుకగు రుక్మియనువాఁడు కృష్ణునియెడ నకారణవిరోధంబును వహించి తనచెల్లెలినిఁ జేది దేశాధీశుండును, కృష్ణునకాగర్భ శత్రువునగు శిశుపాలునకీయఁదలంచి బంధువులను దూదకుఁ దల్లిదండ్రులను నడ్డుపెట్టి వివాహప్రయత్నములఁ గావింపఁ దొడంగెను భీష్మకుండును కుమారుని కెదురువలుకఁజాలక దైవవిధి యెట్లున్నదోయట్లే జరుగఁగలదని మిన్నకుండెను. శేముషీ సింధువులగు బంధువులందఱును దుస్సంఘుఁడగు రుక్మిని 'నీకిదితగదు' అని యెన్నియోమారులు బుద్ధిసెప్పిరి. తుదకు నారదుఁడును 'ఈకార్యమునందు నీవు పాల్గొనినచో నిక్కముగాఁ గృష్ణునివలనఁ బరాభవింపఁబడెద' వని యాతనికిఁ దెల్పియుండెను. కాని రుక్మి యెవ్వరిని లక్ష్యపెట్టలేదు.

రుక్మిణికి మొదటినుండియు శ్రీకృష్ణునియందే బద్ధానురాగముండెను. అట్టియెడ నామె రెండవవానిఁ జేపట్టనేర్చునా? తనవివాహమునకుఁ దనయన్న యడ్డునిల్చి యున్నవాఁడను

మాట నెఱింగినవెంటనే రుక్మిణి మిక్కిలి విచారమునుబొంది కృష్ణునిఁ బొందుటెట్లాయని యాలోచింప సాగెను. తుదకు ధైర్యముఁవహించి తనకాప్తుండగు నగ్నిద్యోతనుఁడను భూసుర శ్రేష్ఠునిఁ దనకడకు రప్పించుకొని యాతనికి సర్వమును దెలియఁజేసి, ద్వారకానగరమున కరిగి యెట్లైనను శ్రీకృష్ణునిఁ

రుక్మిణీదేవి సందేశము.

దోడ్కొని రావలసినదని ప్రార్థించెను. ఆతండును వల్లెయని యానాఁడే ద్వారకకుఁ బయనమయ్యెను. దినదిన ప్రయాణంబు నొనర్చి యగ్నిద్యోతనుఁడు శ్రీకృష్ణుని సందర్శించెను. కృష్ణుండును దన్నుఁగూర్చివచ్చిన యావిప్రపుంగవుని నర్ఘ్యపాద్యాది విధుల సత్కరించి కుశలప్రశ్నానంతర మేమియు నెఱుంగనివానివలె వచ్చిన పనియేమని ప్రశ్నించెను. అగ్నిద్యోతనుండును దాను వచ్చినకార్యమును దెలుపఁ దలంచి "కృష్ణా! నీవెఱుఁగని వృత్తాంతంబేమికలదు? అయినను మాయామానుష విగ్రహుండ వగుటవలన నెఱుంగనట్లు నటించుచుంటివి. నావచ్చిన కార్యమును దెల్పెద వినుము. విదర్భదేశాధీశుండైన భీష్మకుని పుత్రిక రుక్మిణియను కన్యకామణి నిన్ను వరింపఁ గోరియున్నది. తల్లిదండ్రులందుకు సమ్మతించిరి. కాని యామెయన్నయగు రుక్మియనువాఁడు సర్వప్రాణ రంజకుండవగు నీయందే లోకో శత్రుత్వమును వహించి తనచెల్లెలిని శిశుపాలునకీయఁ

దలంచి యుండెను. కుమారున కెదురాడఁజాలక భీష్మకుఁడు మౌనము వహించెను. తనయన్న యొక్క దురాలోచనమును దెలిసికొని రుక్మిణి యనాథ రక్షకుండవగు నీకడకు నన్నంపి నది. ఇదిగో! ఆమె నీకుఁగా నావలనఁజెప్పి పుత్తెంచిన సందేశంబును దెల్పెద వినుము —

'కృష్ణా!

సీ॥ ఏనీగుణములు క • ర్ణేంద్రియంబులఁ సోఁక
దేహతాపంబులు • దీరిపోవు
నేనీశుభాకార • మీక్షింపఁగన్నుల
కఖిలార్థలాభంబు • గలుగుచుండు
నేనీచరణసేవ • లేప్రొద్దుచేసిన
భువనోన్నతత్వంబుఁ • బొందఁగలుగు
నేనీలసన్నామ • మేప్రొద్దుభక్తితోఁ
దడవిన బంధు సం • తతులువాయు

గీ॥ నట్టినీయందు నాచిత్త • మనవరతము
నచ్చియున్నది నీయాన • నానలేదు
కరుణఁజూడుము కంసారి • ఖలవిదారి
శ్రీయుతాకార! మానినీ • చిత్తచోర!

సీ॥ ప్రాణేశ! నీమంజు • భాషలువినలేని
కర్ణరంధ్రంబుల • కలిమియేల?
పురుషరత్నము! నీవు • భోగింపఁగాలేని
తనులతవలని • సౌందర్యమేల?

భువనమోహన! నిన్నుఁ • బొడగానఁగాలేని
చక్షురింద్రియముల • సత్త్వమేల?
దయిత నీయధరామృ • తంబానఁగాలేని
జిహ్వకు ఫలరస • సిద్ధియేల?
ఆ॥ వె॥ నీరజాతనయన! నీవనమాలికా
గంధమబ్బలేని • ఘ్రాణమేల?
ధన్యచరిత! నీకు • దాస్యంబు సేయని
జన్మమేల ? యెన్ని • జన్మములకు

ఉ॥ అంకిలి సెప్పలేదు చతు • రంగబలంబుల తోడనెల్లి యో
పంకజనాభ నీవు శిశు • పాలజరాసుతులన్ జయించి నా
వంకకు వచ్చి రాక్షస వి • వాహమునన్ భవదీయశౌర్యమే
యుంకువసేసి కృష్ణ! పురు • షోత్తమ! చేకొని పొమ్ము వచ్చెదన్

కావునఁ గృష్ణా! అనాథయగు నాకన్యకామణిని రక్షింపుము. బయలుదేరుము. లెమ్ము.' అని విన్నవింపఁ గృష్ణుండు రుక్మిణి యందిదివఱకే బద్ధానురాగంబుఁ గలిగి యున్నవాఁడగుట వలనఁ దోడనే దారుకచోదితంబైన రథంబునెక్కి, యగ్నిద్యోతనునితోఁ గలసి విదర్భకుఁ జనెను. రుక్మిణిఁ దెచ్చునప్పుడు యుద్ధంబుసిద్ధంబని తలపోసి, శ్రీకృష్ణునకుఁ దోడుగావలయు నని యాతఁడరిగిన యనంతరము బలరాముఁడు యాదవసేనా సమేతుండై తానుగూడ విదర్భకరిగెను.

కృష్ణుండు కుండిననగరంబును జేరునప్పటికే, పెండ్లి కొడుకగు శిశుపాలుఁడు జరాసంధాది మిత్రులతో వచ్చి

యుండెను. ఆతఁడు పురప్రవేశంబొనర్పక, యగ్నిద్యోత నుని వలనఁ దనరాకను రుక్మిణికిఁ దెలియఁజేసెను. వివాహ కాలంబు సన్నగిల్లుచుఁ గులాచార ప్రకారంబు గౌరీపూజా ర్థమై, రుక్మిణి పురంబు వెలుపలనున్న గౌరీదేవాలయంబు నకు సకల బంధుసమేతయై వచ్చియుండెను. అట్టియెడఁ గృష్ణుఁడొరులకుఁ గానంబడక యదృశ్యరూపుండై యాలయ సమీపంబున నిలచియుండెను. రుక్మిణియుఁ దనకుఁ గృష్ణునే పతిగాఁ గూర్పుమని నగజాతకుఁ బూజలుగావించి యాలయం బునుండి వెలుపలికివచ్చెను. ఆసమయంబున లేళ్ళగుంపునందు సింహంబు దుమికినచాడ్పున విరోధివర్గంబునడుమఁగృష్ణుండు దుమికి యవలీలఁగా రుక్మిణిఁ గైకొని నిజరథంబునందు నిల్పి ద్వారకానగరాభిముఖుండై పోవఁదొడంగెను. ఆయద్భుత సంఘట్టనంబునకు శిశుపాల రుక్మి జరాసంధా దులు నివ్వెఱపడి కొంతవడికిఁ దెలివిఁదెచ్చు కొని యాయుధహస్తులై తమతమ పరివార

శిశుపాల జరాసంధాదుల పరాభవము.

ములతోఁ గృష్ణుని వెంబడించిరి. అట్టియెడ బలభద్రుండు నిజసైన్యంబులతో శత్రువుల కడ్డంబువచ్చి ఘోరాహవంబు సేయఁ జొచ్చెను. ఇంతలోఁ గృష్ణుండు కుండినగరంబు నతిక్రమించెను. కాని రుక్మిమాత్రము బలరాముని బారి నుండి తప్పించుకొని, నిజసైన్యంబులతో నతిరయంబునఁ జను

దెంచి శ్రీకృష్ణుని మార్కొనెను. శ్రీకృష్ణుండును దృటికాలంబుననే యాతని సైన్యంబుల రూపుమాపి, యాతనిని విరథునిఁగను హతాయుధునిఁగను నొనర్చి, కృపాణహస్తుండై యాతనిఁ దెగవ్రేయుటకు రథంబునుండి క్రిందికి దుమికెను. కాని రుక్మిణీదేవి తన యన్నప్రాణంబులఁ గాపాడవలసినదని ప్రార్థించెను. కృష్ణుఁడును గరుణామయుండుగావున నాతనిఁ జంపక 'బావా! రమ్మని' పిలుచుచు రుక్మిఁజేరంజని పదునుగల కత్తితో గడ్డంబును, మీసంబును, దలయును రేవులు వాఱఁగొరిగి యాతనిని వికృతిరూపునిఁగాఁ జేసి విడిచిపెట్టెను. అట్టియెడ బలభద్రుండును శిశుపాల జరాసంధాదులఁ బారఁద్రోలి తనతమ్మునిఁ గలసికొనెను.

అవ్విధంబునఁ గృష్ణుండు రుక్మిణిఁగైకొనివచ్చి ద్వారకానగరంబున నతివైభవంబుతో నొక్క శుభముహూర్తంబున నామెను బెండ్లియాడెను. కృష్ణుఁడు రుక్మిణినొక్కదానినే గాక సత్రాజిత్తుని పుత్రికయగుసత్యభామను, జాంబవంతుని పుత్రికయగు జాంబవతిని, నాగ్నజిత్తి, మిత్రవింద, మొదలగు వారల నేడ్వురిని, మఱియు నరకాసురుని వధానంతరమాతండు చెఱవట్టిన పదాఱువేల కన్నియలను బరిణయంబాడెను.

శ్రీకృష్ణుని దారాపుత్రాదులు.

రుక్మిణియందు శ్రీకృష్ణుఁడు ప్రద్యుమ్నుండను కుమారునిఁ గాంచెను. ప్రద్యుమ్నుండును గాలక్రమంబున బెరిగి పెద్దవాడైయుండు నెడ

కృష్ణుండాతనికిఁ బ్రభావతియను కన్యనుదెచ్చి పెండ్లియొన ర్చెను. ప్రద్యుమ్నుండును బ్రభావతితోఁ గాపురంబును సేయుచు నామెవలన ననిరుద్ధుఁడను కుమారు నొక్కనిఁ గాంచెను. అనిరుద్ధుండును బాల్యయౌవనంబులఁ గడచి కౌమారప్రారంభమున బాణాసురుని పుత్రికయైన వృషా కన్యను వరించెను. కాని బాణాసురుండు విష్ణుద్వేషియగుట వలన ననిరుద్ధునిఁ బట్టి కారాగృహంబునం దుంచెను. కృష్ణుండును మనుమని విడిపించునిమిత్తమై బాణునిపై దాడి వెడలి ఘోరాజియందతని సహస్రబాహువుల ఖండించి శంక రుఁడు ప్రార్థింప నాతనిఁ జంపక, వృషాకన్యానిరుద్ధులతో నిజపురంబునకు మగిడివచ్చి తనయవతారంబునం దొనర్పవల సిన కుంతీసుత పరిపాలనముఁగూర్చియుఁ గౌరవ వినాశంబుఁ గూర్చియు విచారించుచుండెను.



౯

పాండు రాజ తనూభవులైన యుధిష్ఠిర భీమార్జున నకుల సహదేవులను వారు తమ పెద్దతండ్రియైన ధృతరాష్ట్రుని యాజ్ఞానుసార మింద్రప్రస్థపురంబు రాజధానిగా ధరణీపాలన మొనర్చుచుండిరి. కృష్ణునకుఁ బాండవులు మేనత్తకుమారులును, నిజచరణసరసీరుహాయుగళస్మరణసుధారసాస్వాదసంజనితసంతతసంతోషసంపత్పరిపూర్ణులును, నందుఁ బాండవమధ్యముఁడగు నర్జునుఁడు, నిజసోదరీ ప్రాణనాథుం డగుటవలనను దుర్యోధన ప్రముఖులగు కౌరవుల మూలంబునఁ గష్టంబులు పెక్కులు వారికిఁ గలుగుచున్నను, నెల్లప్పుడు వారియోగక్షేమముల విచారించుచు నన్నింటను జేదోడుగానిలచి వారినిఁ గాపాడుచుండెను. ధర్మజుండు కేవలము ధర్మస్వరూపుఁడా యేమి యనునట్లు నయగుణ వర్తనంబున నిలచియుండుట వలనను, నాతని యనుజన్ములతని యాదేశంబు ననుసరించి వర్తించుట వలనను, రాజలోకంబంతయుఁ బాండవుల ననేకవిధంబుల గొప్పగాఁ జూచుచుండెను. కాని, దాయాదులును, ధృతరాష్ట్రనందనులును, నగు సుయోధనాది కౌరవులు మాత్రము వారిని నసూయతోఁ జూచుచుండిరి.

పాండవుల చరిత్ర

ఇట్లుండ నారదప్రేరితులగు పాండవులు, తమ చిన్నతనంబునందే మృతినొందిన తమజనకుని యాత్మశాంతికై, రాజసూయంబను మహాధ్వరంబు నొకదానిని సేయసమకట్టిరి. అందుకు శ్రీకృష్ణుండును వారల ప్రోత్సహించెను అన్నిఁటికిని మూలకారణుఁడగు శ్రీహరి తమవాఁడగుటవలనఁ బాండవులును ధైర్యమువహించి యామహాధ్వరంబును సలుపుటకుఁ గడంగిరి. ధర్మజుని నల్వురుతమ్ములగు భీమార్జున నకుల సహదేవులు నాల్గుదిక్కులకరిగి యందున్న రాజచక్రంబును నవక్రవిక్రమపరాక్రమక్రమవిశేషంబున నవలీల జయించిఁ తమయగ్రజుని పేరఁ గానుకలను గొనితెచ్చిరి. కాని జరాసంధుఁడుమాత్రము జయింపఁబడక మిగిలియుండెను.

రాజసూయాధ్వర ప్రయత్నములు.

జరాసంధుఁడు తనకాగర్భశత్రుండగుటవలనను,నాతని వలన సాధుహింసయు స్వబంధు హింసయు జరుగుచున్నందువలనను, నాతండు జయింపబడనిచోఁ దనభక్తులైన పాండవుల యధ్వరోద్యమమునకు విఘ్నంబు గలుగనున్నందువలనను, శ్రీకృష్ణుండు, జరాసంధ వధోద్యోగ సమాచరణంబునకు, భీమార్జున సహితంబుగా బ్రాహ్మణవేషమునుదాల్చి, భూసురాభీష్ట ఫలప్రదాతయగు మాగధునికడకరిగెను. ఆతండును బ్రాహ్మణవేషంబులతోనున్న శ్రీకృష్ణ భీమార్జునులఁగాంచి, యేమికావలయునో

తెల్పుఁడొసంగెదనని పలికెను. అంతఁగృష్ణుఁడును, దమ కాజిభితుదక్క యన్యంబువలదని నుడువుచు, వారునుదానును స్వస్వరూపంబులఁదాల్చి తామెవ్వరైనదియు నాతని కెఱుగఁ బల్కెను. జరాసంధుఁడును, దన్నుదుర్కొనఁజాలక పెక్కు మారులు పాఱిపోయిన కృష్ణునిఁగాంచి నగుచు 'కృష్ణా! మదీయబలపరాక్రమంబు లింతలోనే మఱపునకు వచ్చెనా? నన్నుదుర్కొనఁజాలక నట్టనడిసముద్రంబున నగరుగట్టుకొన్న జగదేకజెట్టివి నీవేగదా? అయినఁగానిమ్ము. నీవునన్నుగెలు వఁజాలవు గనుక నిన్నునేను మార్కొనను. అర్జునుండు నాకన్నఁ బిన్నవాఁడగుటవలన నాతనితోఁబోరుట నాయట్టి యుత్తమవీరునకు ధర్మంబుగాదు. అన్నివిధంబుల భీముండు నాకుఁ దగియున్నవాఁడుగావున నాతనితోఁ

జరాసంధవధ.

బోరెద" నని పల్కుచు ద్వంద్వయుద్ధమునకు వాయుపుత్రుని నాహ్వానించెను. భీముండును కృష్ణానుమతంబున నుద్దండ గదాదండంబునుగొని తొలుఁ ద్రొత్త నాతనితో గదాయుద్ధంబునకుఁ దలపడెను. జరాసం ధుఁడును బాహుబల పరాక్రమములయం దసమానుండగుట వలన నన్నివిధంబుల భీమునకు సమానమగుచుండెను. గదా యుద్ధంబు ఘోరంబుగా జరుగుచున్నసమయంబున నన్యోన్య సంఘర్షణంబువలన నిరువురిగదలు ముక్కలగుడునంత నొక

రితో నొకరు ముష్టాముష్టి, బాహాబాహి, కచాకచి, పోరాడం దొడంగిరి. అట్టియెడ భీముండలసటనొంది, యరినిరసనోపాయంబుం గానక చింతించుచుండ, గృష్ణుండది తెలిసికొని, భీముండు తనదిక్కు సూచుచుండ నొక్క శాఖాగ్రంబును రెండుగాం జీల్చివైచి, జరాసంధు నట్లు హత మొనర్పవలసినదని సంజ్ఞగాంజూపెను. గాడ్పుపట్టి యాకీలు దెలిసికొని, యినుమడించిన సమరోత్సాహంబున, సమధిక బాహుబలాతిశయుండగుచు, జరాసుతుని నవలీలం బుడమికింబడంద్రోసి, నిజ చరణంబున నాతని చరణంబొండు ద్రొక్కిపట్టి బాహుయుగళంబున రెండవచరణంబును గదలకుండంబట్టి, హరికృపాలబ్ధ బలోన్మత్తాతిరేకంబున లేంగొమ్మను జీలునట్లు పాదజాను జంఘోరుకటిమధ్యోదరాంస కర్ణనయనంబులు సమానంబులుగ వేఱుభాగంబులగుచాడ్పున వ్రయ్యలువాపి విష్ణుద్రోహియు, లోకద్రోహియునగు జరాసంధుని హత మొనర్చి సింహనాదంబొనర్చెను.

అవ్విధంబున మాగధుని సంహరించి కృష్ణభీమపార్థులు ధర్మజుని జేరంజనినంతనే యాతండును, దిగ్విజయంబు సంపూర్తి నొందినదగుటవలన, విధ్యుక్త ప్రకారంబుగా నధ్వర దీక్షనుగైకొనెను. ఆయధ్వర మహోత్సవంబునకు, నారద సాత్యవతేయ కస్యప భరద్వాజ విశ్వామిత్ర వీతిహోత్ర

మైత్రేయ మధుచ్ఛంద గౌతమ భార్గవ వసిష్ఠ వామదేవ ధౌమ్యపరాశర కణ్వవైశంపాయన ప్రముఖులగు సకలమునీం ద్రులును, వివిధ దేశాధీశులగు భూపాలురును, యాదవ ద్రుపద కౌరవ ప్రముఖులగు బాంధవులునుభీష్మద్రోణ కృపా శ్వత్థామ విదురాది యాత్మీయులును, మొదలగు వారంద అును వచ్చియుండిరి. శ్రీకృష్ణుం డన్నివిధంబుల ధర్మజునకుఁ దోడుగానుండెను. అధ్వర మంటపంబుననున్న సకలజనులు వినునట్లు, నారదుండు, ధర్మజుని ధర్మప్రవర్తనముఁ గూర్చియు, నాతని రాజసూయ మహాధ్వర వైభవంబును గూర్చియుఁ బలు తెఱంగులఁ గొనియాడెను. అట్టియెడ భీష్ముండు తత్క్రతు వైభవంబున కెంతయు సంతోషించి ధర్మజుఁజూచి 'ధర్మజా! స్నాతకుఁడును, ఋత్విజుఁడును, సద్గురుఁడును, భూతలేశు డును, సంయుజుఁడును, ననువారలు పూజనీయులగుచున్నారు అట్టి వారియందు సద్గుణశ్రేష్ఠుఁడగు వాఁడుత్తముఁడగుచు న్నాఁడు. కావున నిచ్చోటనున్న వారిలో నట్టి వానినొక్కని గుర్తించి, యాతనికగ్రతాంబూ లంబునిడి, యధ్వరంబొనర్పఁ గడంగుము. ఇది ధర్మపద్ధతి' యనివచింప, ధర్మజుండట్టివానిని గురుతింపనేరక 'తాతా! అట్టిపుణ్యపురుషునిఁగూడ నీవేనిర్ణయింపు'మని భీష్ము నితోఁబలికెను. అంత బ్రహ్మజ్ఞాన పరిపూర్ణుండగు మందాకినీ

శ్రీకృష్ణుని సభాపతిత్వము.

నందనుండు ' ధర్మజా! క్రతుహర్తయు, క్రతుభోక్తయు, క్రతుమూర్తియు, క్రతుకర్తయునగు శ్రీహరియిందు వెలుంగుచుండ నట్టి పుణ్యపురుషునికొఱకు వెదకుటయేల? చింతించుటయేల? నిర్ణయించుట యేల ? అన్నిటికిని శ్రీకృష్ణ పరమాత్మయే యాధారభూతము. కావున నామహాత్మునకు గ్రతాంబూలంబు నిమ్మ ' ని పలుక, ధర్మజుండును, సేవలము యజ్ఞస్వరూపుఁడైన కృష్ణునిఁబూజించి యగ్రతాంబూలంబు నొసంగెను. అచ్చటనున్న వారందఱును గరతాళంబులొనర్చి తమ యంగీకారమును సూచించిరి. శ్రీకృష్ణుఁడు సంతసించుటవలన సకలభూతములు సంతసించెను. నభోకాంతామణి కనుఁగొనల నుండి యానందబాష్పములు రాలుచున్నవా యేమియనునట్లు పువ్వులతోఁ గూడిన యాకాశగంగోర్మిశీకరంబులు రాలఁ జొచ్చెను. విశ్వమంతయు, విశ్వమయునిఁగూర్చి యానందల హరియందు మునుంగఁజొచ్చెను.

ఆనందరససాగర సముత్తుంగతరంగడోలికానివహంబుల నుయ్యేలలూగుచున్న నాసభికుల యందొక్కరు మాత్రము కృష్ణునియం దసూయాపరులై చింతాసాగరంబున మునింగి యుండిరి. ఆట్టివారెవ్వరోగాదు. కృష్ణునకాజన్మవైరి యగు శిశుపాలుఁడే! ధర్మరాజునకు భీష్ముం డుపదేశించుటయు నాతని యుపదేశప్రకారము ధర్మనందనుఁడు కృష్ణున కగ్రతాంబూలంబు నొసంగుటయు దానికి సభికులెల్లరుఁ గరతాళంబుల

శిశుపాలుఁడు ధర్మభీష్ములను దూషించుట.

మూలంబునఁ దమయంగీకారంబును సూచించుటయు మొదలుగాఁగలవన్నియు శిశుపాలునకు హృదయవిదారకములుగ నుండెను. ఆతం డెంతమాత్రమును సహింపఁజాలక క్రుద్ధుఁడై లేచినిలువఁబడి ధర్మజునిఁగాంచి 'ధర్మనందనా! ఇన్నినాళ్ళనుండియు సకలధర్మాధర్మ విచక్షణుఁడవని నిన్నుఁ దలఁచియుంటిని. నీధర్మబుద్ధియంతయు నేఁడు దెలియవచ్చినది. వృద్ధాప్యము వలన యుక్తాయుక్తజ్ఞానంబుఁ గోల్పోయిన భీష్ముండు సెప్పినంతనే, దానియందుండు నిజానిజంబులనరయక విశిష్టారాధ్యులగువారెందఱో యిచ్చోటనుండ, వారలఁగాదని కృష్ణునకగ్రతాంబూలంబు నొసంగుటనీకుధర్మమేనా? కృష్ణునియందేమి గుణంబులున్నవని యాతనిని సభాపతిగా నొనర్చితివి? వృద్ధనిపూజించితినంటివా యందఱికన్న వృద్ధుండగు వసుదేవుండు లేఁడా? ఆచార్యుఁడని పూజించితినంటివా యాతనికంటె గొప్పవారగు కృపద్రోణులు లేరా? ఋత్విజుఁడని పూజించితినంటివా ద్వైపాయనుండు లేఁడా? భూనాథుఁడని పూజించితినంటివా, యయాతిశాపంబువలన యదువంశమున కాగౌరవము లేదని యెఱుంగవా? ధర్మనందనా! కృష్ణునేమని పూజించితివి? ముదుసలియగు భీష్ముఁడా నీకు ధర్మమునుపదేశించువాఁడు? అనపత్య దోషుండును, రాజకన్యాపహారణుండును నగు గాంగేయుఁడు ధర్మమును దెలుపునంతటి

వాఁడా? ఆహా! ఏమి కాలవైపరీత్యము. రాజకులంబున కంతకు నేఁడు నీమూలంబునఁ దలవంపు సంఘటిల్లెంగదా? ఒకవేళ నీవును భీష్ముఁడును మూఢాభిప్రాయులైయున్నచోఁ గృష్ణుఁడేనియు సభాపతిత్వము తనకుఁదగదని చెప్పవలదా? తానేమి గుణములు గలవాఁడని యగ్రతాంబూలంబును గైకొనవలయును? ధర్మము ననుసరించినచో, స్త్రీగోబ్రాహ్మణ హింసాపరులగు వారు పూజార్హులుగాకపోవుటయేగాక మీదుమిక్కిలి యట్టి వారు దండనార్హులగుచున్నారు. ఈకృష్ణుండు, స్త్రీవధయును గోవధయును, నమ్మినవారిని జెఱుచుటయును మొదలగు దుష్కార్యముల నెన్నిఁటినో యొనర్చియుండ నట్టివానిని బూజార్హుండని నీవెట్లు భావించితివి? ఏదియేనొకకార్యము సలుపనున్నప్పుడు యుక్తాయుక్తంబుల నెఱుంగవలదా? ఇదియేనా నీధర్మప్రవర్తనము? ఇదియేనాభీష్ముని ధర్మోపదేశము ఇదియేనా కృష్ణునిగొప్పతన' మని యనేకవిధంబుల ధర్మజనదీసుత కృష్ణులను దూలనాడఁ దొడంగెను.

శిశుపాలుఁడు శ్రీకృష్ణుని దూషించుట.

శిశుపాలుని దూషణ వాక్యములకు సభికులెల్లరును జెవులుమూసికొని 'హరిహరీ' యని చింతించుచుండ నట్టియెడ సహదేవుండు రోషకషాయిత నేత్రుండై లేచి యందఱఁ గల యఁజూచి 'ఓసభికులారా! ఇఁక ముందెవ్వఁడేనియు శ్రీకృష్ణ

దూషణంబొనర్చినచో నట్టివాని శిరంబున నిదిగో మదీయ వామపాదంబు నుంచెద' నని పలుకుచు విజృంభించెను. సహదేవునకుఁ దోడుగా నాతనియన్నయగు భీముండు, ప్రళయకాల పర్జన్య గర్జనంబును నిర్జించు భీషణ గర్జనంబొనర్చుచు నుద్దండ గదాదండమండితుండై యాటోపించి 'నేటితో శిశుపాలున కాయువునిండె' నని విజృంభించెను. అదిగని శిశుపాలుఁడు నిజసైనికులఁ బురికొల్పసాగెను. అట్టియెడఁ దనకుంచెయుఁ గృష్ణమృగాజినంబును బలుమఱువీచుచుఁ గలహాబంధువగు నారదుఁడు నృత్యము సేయసాగెను. అట్టి కలకలంబును గాంచి ధర్మజుండు యాగభంగమగునేమోయని దిగులొందుచుండ భీష్ముండాతనికి ధైర్యముసెప్పి భీమసహదేవులఁ గాంచి 'కుమారులారా! మీరొనర్పఁ దలచియున్న పని గృష్ణుఁడే యొనర్చును.

శిశుపాలుని జన్మ వృత్తాంతము.

శిశుపాలుఁడు దమఘోషుఁడనువానికి సాత్వతియందు జనించినప్పుడు నాల్గుభుజంబుల తోడను, లలాటంబునఁ గన్నుతోడను బుట్టెను. తల్లిదండ్రులా వికృతాకారంబునకు భయపడి చింతించుచుండ నశరీరవాణి 'ఓదంపతులారా! మీరేల చింతించెదరు? ఎవ్వరేని వీనినెత్తికొనినప్పుడు మిక్కిలి చేతులును, మిక్కిలి కన్నును దొలఁగిపోయిన యెడల నట్టివాని వలననే యీతఁడు సచ్చునుగాని యన్యులవలనఁ

జావనేరఁ, డని తెలియఁజెప్పెను. ఇట్లుండ బలరామసహితుండై కృష్ణుండొకనాఁడు వారింటికరుగ మేనత్తయగు సాత్వతి కృష్ణునకుఁ దనకుమారు నందిచ్చెను. కృష్ణుడాతని నెత్తికొనినంతనే మిక్కిలి చేతులును, మిక్కిలి కన్నును దొలఁగిపోయెను. అప్పుడు తనకుమారుఁడు కృష్ణునిచేత మడియునని యెఱింగి, నూఱుతప్పులవఱకుఁ దనపుత్రుని క్షమింపవలసినదని కృష్ణుఁ బ్రార్థింప నాతఁడు వల్లెయని నిజపురంబున కరిగెను. అవరంబువలనఁ గృష్ణుఁ డుపేక్ష సేయుచుండెనేకాని లేకున్న వీని ప్రాణము లెప్పుడో యెగిరిపోయియే యుండు, నని వారల శాంతపఱచెను.

అట్టియెడఁ గృష్ణుండగ్రపీఠంబునుండి డిగ్గి సభికులఁ జూచి 'మహాత్ములారా! నేను శిశుపాలుని తల్లికొసంగిన వరప్రకారమీతని శతాపరాధంబుల క్షమించితిని. ఇఁకమీఁద నీతని క్షమింపఁజాలను. నేటితో నీదుష్టుఁడంతమొందఁగల' డని చిత్తంబున సుదర్శనంబును దలంచెను.

శిశుపాల వధ.

ఆక్షణంబు ననే సకలదైత్య దానవ దుష్టజనారణ్య వీతిహోత్రంబగు సుదర్శనంబు విస్ఫులింగంబులెగయఁ బరతెంచి శ్రీకృష్ణుని పాణితలంబు నలంకరింప నాతండును గెంగేల నద్దానిని గిరగిరఁద్రిప్పి శిశుపాలునిపైఁ బ్రయోగించెను. ప్రయోగించుటయే తడవుగాఁ గృష్ణ

ద్వేషియగు శిశుపాలునిమస్తకము రుధిరపూరితంబై ధరణిఁ ద్రోఁ బడెను. దుష్టసంహారంబగుటవలన దేవతలు శ్రీకృష్ణునిపైఁ గుసుమవృష్టిని గురియించిరి. ధర్మజ రాజసూయమహాధ్వరం బును నిర్విఘ్నముగా మూగింపఁబడెను. సర్వవ్యాపియు, సర్వ కారణుండును. సర్వాధారుండును, సర్వజ్ఞుండును సర్వవస్తు భూతాత్మకుండును, నగు శ్రీకృష్ణపరమాత్మునకెగ్గాచరించి ప్రాణములతో మనఁగలవారెవ్వరుగలరు? ఆమహాత్మునకే గాక, యాతనిపాదసేవకులకేనియు సేవకులకేగాక, సేవకజన సేవకులకేనియు, నెగ్గాచరించి ప్రాణములతో నుండనోపువా రెవ్వరుగలరు?

శిశుపాలుని వధానంతరమాతనియనుచరులగు, సాల్వ పౌండ్రక దంతవక్త్రులనువారు ముగ్వురు సకల సైన్యంబుల సమకూర్చుకొని కృష్ణునిపై దాడివెడలిరి. అందు సాల్వుండు శివునివలనఁ బెక్కువరంబులనందినవాఁడగుటవలన 'ధరణిపై యాదవులను పేరు లేకుండ నొనర్తు' నని ప్రతిజ్ఞఁగైకొని యుం

శ్రీకృష్ణుఁడు సాల్వపౌం డ్రకదంత వక్త్రులను వధించుట.

డెను. అట్లు వారు ముగ్వురును దన్నెదు ర్కొన హరియును వారల నెదుర్కొని మహాహవ మొనర్పసాగెను. బలరాముం డట్టి యెడ యాదవసైన్యంబులఁ గూర్చుకొని విరోధిసైని కులఁ బరిమార్పఁ దొడంగెను. దోమలు పదివేలు చేరినమైనను

సామజమును మరలింపఁగలవా? శ్రీకృష్ణుండు కొంతవఱకు వినోదార్థంబు సంగరంబొనర్చి, పరప్రాణాపహరణోద్యోగాచరణంబున నమోఘంబగు తనసుదర్శనంబును బ్రయోగించి వారల హత మొనర్చెను. వారి చావునుగాంచి విరోధి సైన్యంబులన్నియుఁ బలాయనము లయ్యెను. ఇవ్విధంబునఁ గృష్ణుండు భూభారంబును దగ్గించుచుండెను.



# ౧౦

పాండవులు ధర్మపరులయ్యును మాయజూదంబున దుర్యోధనునివలన సకలసంపదలను గోలుపోయి, యనుకొనిన ప్రకారము పన్నెండువత్సరము లరణ్యవాసమును, నొక్కయే డజ్ఞాతవాసమును జరిపి, యుపప్లావ్యంబునకు వచ్చియుండిరి. అట్టియెడ ధర్మజుండు తమ్ములయాలోచనంబు ననుసరించి, తమకర్ధరాజ్యంబునిచ్చుటయో, లేక యుద్ధమునకు సిద్ధపడుటయో, యేదియైనదియుఁ దెలిసికొను నిమిత్తమై కౌరవుల కడకుఁ దమకు నచ్చినవానినిఁ గార్యాకార్య విచక్షణదక్షుని నొకని రాయబారిగాఁ బంపఁదలంచెను. అట్టి వాఁడు శ్రీకృష్ణుఁడొక్కఁడే యని యెఱింగి యామహాత్మునకు ధర్మరాజుతమయభిప్రాయమును దెలియఁజేసెను. కృష్ణుఁడును, దుష్టశిక్షణమున భూభారంబును దగ్గింప నవతరించియున్నవాఁడగుట వలనను, దనకు భక్తురాలును కేవలమయోనిజ సంభవురాలును — నగు ద్రౌపదీదేవికిఁ గౌరవులు మానభంగమొనర్చి యున్నందువలనను, దాను ధర్మమునంటియుండువాఁడు గావున "ధర్మో జయతి" యనువాక్యమును సార్థకంబుసేయవలసినవాఁడగుట వలనను, నన్నిఁటికంటెను గౌరవవంశనిర్మూలనమునకే తాను యవతారమెత్తియున్నవాఁడగుటవలనను, నిన్నికారణములుం

పాండవులు శ్రీకృష్ణుని రాయబారిగానెన్నుకొనుట.

కుటఁజేసి, తాను గౌరవులకడకుఁ బాండవుల పక్షమున రాయబారిగా నరుగుటకు సమ్మతించెను. ధర్మజుండును గృష్ణునకుఁ జెప్పవలసిన విషయముల నన్నింటినిఁజెప్పి హస్తినాపురంబున కంపెను.

కృష్ణుండును హస్తినాపురంబును బ్రవేశించి తనభక్తుండైన విదురునియింట బసచేసి, యొకనాఁడు ధృతరాష్ట్రుండాప్తబంధు పుత్రమిత్రాదులతో నిండుపేరోలగంబుండిన సమయమున రాజానుమతిని గౌరవ సభామందిరంబును బ్రవేశించెను. కృష్ణావతార తత్త్వంబును సంపూర్తిగా నెఱింగినట్టి భీష్మద్రోణాదు లాతనికి నాత్మ నమస్కారంబు లొనర్చి పరమాత్మునిగాఁ దలంచుచుండ మూఢులగు దుర్యోధనాదు లామహనీయునొక యలంతి మానవునిఁగాఁ దలంపసాగిరి. కృష్ణుండును సభాభవనంబును

శ్రీకృష్ణ సందేశము.

బ్రవేశించిన కొంతవడికి, నిజాసనంబునుండి లేచి ధృతరాష్ట్రునిఁ గనుంగొని యెల్లరును వినునట్లు "మామా! ధర్మమూర్తియగు ధర్మజుని పంపున నేను మీకడకు రాయబారినై వచ్చియుంటిని. పాండవులు సమయభంగ మొనర్పక యనుకొనినప్రకార మరణ్యాజ్ఞాతవాసంబుల జరిపివచ్చి ప్రస్తుతముపప్లావ్యంబున నున్న సంగతి యెల్లరకును దెలిసియేయున్నది. ఇదివఱకుఁ దెలిసియో తెలియకనో యొనర్చినట్టి తప్పులన్నింటినిఁ బ్రస్తుతము మీరైనను వారై

నను బరిగణింపవలదు? ఉభయవంశములును సర్వశ్రేయంబులఁ బొందియుండు తెఱంగున విచారించి నీతమ్ముని కొడుకు లైన పాండవులకు న్యాయప్రకారముగా రావలసినయర్ధరాజ్యంబు నొసంగుము. ఇందువలన నుభయులకు మేలు గలుగును. ఒకవేళ వారికి యర్ధరాజ్యంబొసంగక యుద్ధమునకే సంసిద్ధపడెదవేని "ధర్మోజయతి" యను సూత్రమును మాత్రము మఱవకుము. ఎచ్చట ధర్మముండునో యచ్చట భగవంతుఁడుండును. ఎచ్చట భగవంతుఁడుండునో యచ్చట సర్వశుభములు నుండును. నీకుమారు లధర్మపరులగుటవలన నీసూత్రము వారియందు సమన్వయింప నేరదు. యుద్ధమే సిద్ధమగునేని, నీవంశనిర్మూలము సిద్ధమని యెఱుంగుము. పాండవులు సామాన్యులుగారు. వారు కేవలము దేవతాంశసంభూతులు. శాంతమూర్తియగు ధర్మజుఁ డొక్కరుండలిగెనేని సకల భువనంబులును భస్మీభూతంబులుగాఁగలవు. పతివ్రతా శిరోమణియగు ద్రౌపదీదేవి నోటినుండి పరుషవాక్యములు వెలువడినచో, నీనూర్గురు కుమారు లొక్కపరి మృతినొందఁగలరు. ఇదియంతయును దథ్యము. నాహితంబును గైకొనక సంధికొడంబడనిచో నేఁ జెప్పిన దంతయు జరిగితీరును. ఓమహాత్మ దుర్యోధనా! సావధానుఁడవై వినుము. నీమూలమున నీవంశక్షయమగుకాలము దాపరించుచున్నది. ఇప్పటికిని మించిపోలేదు. మదీయ

హితవాక్యానుసారము పాండవుల కర్ధరాజ్యంబు నొసంగి వారితో స్నేహభావమున మెలంగుము. భీష్మ ద్రోణ కర్ణాశ్వత్థాములుండిరిగదాయని యుద్ధమునకుసిద్ధుఁడవగుచుంటివేమో యదియెంతమాత్రమును దగదు. వేయిమంది కర్ణులున్నను వొక్కపార్థునితో సమానులు గాఁజాలరు. ధర్మోజయతియను సూత్రమెంతమాత్రమును నిరర్థకంబుగానేరదు. చక్కఁగా విచారించుకొనుము" మని తెలియఁబలికి తన యాసనంబధిష్ఠించెను. కృష్ణుని హితప్రబోధమునకు భీష్మ ద్రోణ కృపాశ్వత్థామ విదురాదులెంతయును సంతసించిరి. కాని దుర్యోధనునకది వినుటకుఁగూడ హేయముగాఁదోఁచెను. అందువలన నచ్చోట నుండఁజాలక శకుని కర్ణదుశ్శాసనాదులతోఁ గలసి సభనుండి లేచిపోయెను.

కృష్ణునిహితప్రబోధమునకు ధృతరాష్ట్రుఁడేమిచెప్పునోవిందమని సభికులెల్లరును నిశ్శబ్దముగా నుండిరి. కాని ధృతరాష్ట్రుఁడేమియు బదులుసెప్పక మౌనమువహించి యుండెను. అట్టియెడ సభనుండి లేచిపోయిన దుర్యోధనాదులు శ్రీకృష్ణ పరమాత్మను బంధింప వలయునని ప్రయత్నించుచుండిరి. ఆ సమయమునఁ గృష్ణునికనిష్ఠసోదరుండగు సాత్యకి కౌరవుల దురాభిప్రాయమును గుర్తించి సభికులెల్లరు వినునట్లు కృష్ణునితో

శ్రీకృష్ణుఁడు విశ్వరూపంబును దాల్చుట.

'అగ్రజా! నిన్నుబంధించుటకు దుర్యోధనాదులు ప్రయత్నించుచున్నారు. ఆజ్ఞయయ్యేనేని వారల నిప్పుడే మదీయ నిశితకరవాలంబున కెరజేసెద' నని పలికెను. ఆమాటలకు భీష్మద్రోణాదులు నివ్వెఱపడిరి. 'కౌరవవంశ క్షయకాలము సమీపించుచున్న' దని సభికులందఱును దలంపసాగిరి. అట్టియెడ శ్రీకృష్ణుం డాసనంబునుండి లేచి 'సభికులారా! వింటిరిగదా? దుర్మార్గ ప్రవర్తనుఁడగు సుయోధనుఁడు నన్ను బంధింపఁదలఁచి యత్నించుచుండెనట. కానిండు, ఓమూఢదుర్యోధనా? సకలమానవ బంధవిముక్తుండవగు నన్నే బంధింపఁ దలంచితివా? కౌరవ వినాశకాలమిప్పుడిప్పుడే డగ్గఱించుచున్నది. రమ్ము. ఇదోచేతనగునేని నన్నుబంధింపు' మని విశ్వరూపంబునుదాల్చెను. ఆ విశ్వరూపంబున నష్టదిక్పాలకులును, బ్రహ్మ రుద్రేంద్రాదులును, సకలఋషీశ్వరులును, భీష్మద్రోణాదికౌరవులును బంచపాండవులును, వేయేల, పంచభూతాత్మకంబైన విశ్వంబంతియుఁ గానుపించుచుండెను. అట్టి విశ్వరూపంబును గాంచి భీష్మద్రోణాదులు పులకాంకితగాత్రులై, శ్రీకృష్ణ భగవానునిఁ గీర్తింపఁ దొడంగిరి. సభయంతయు జయధ్వానములతో నిండిపోయెను. ప్రకృతియంతయు నానందరస కల్లోలసముద్రంబున మునింగి యుండెను. ఎచ్చోట నాలకించినను "ఓం, ఓం, ఓం, ఓం" అను ప్రణవ మంత్రధ్వనులు విన

వచ్చుచుండెను. అట్టియెడ ధృతరాష్ట్రుండును హరికృపా లబ్ధదృష్టివలన నామహాత్ముని విశ్వాకారమునుగాంచి, తిరిగి యంధత్వము నొందినవాఁడై యాయనంతాకారునితో 'మహాత్మా! విశ్వరూపంబు నుపసంహరింపుము. వినాశకాలము దాపరించుచున్నప్పుడు నీవుమాత్ర మేమిచేయఁగలవు? నావంశక్షయమగునని నాకుఁ జక్కఁగాఁ దెలియును. ఇంకనీవరిగి యుద్ధప్రయత్నమున నుండు' మని చెప్పెను. కృష్ణుఁడును ధృతరాష్ట్రుని వాక్యానుసారము తనవిశ్వరూపంబు నుపసంహరించి, దుర్యోధనాదులవనతవదనులై తన్నుఁ జూచుచుండ, భీష్మద్రోణవిదురాదులు తనవెంటనడువ, సభాభవనమును వీడి యందఱివలన వీడుకోలువడసి పాండవులవద్దకరిగెను. నాట నుండి యుభయపక్షములవారును యుద్ధప్రయత్నములసేయఁ దొడంగిరి.

కౌరవులును పాండవులును రాఁబోవు మహాయుద్ధంబునకు సన్నద్ధులగుచుండఁ గృష్ణుఁడెట్లును పాండవులపక్ష మవలంబించుననియుఁ దానుఁ ద్వారకయందే నిలచియున్న నిజశిష్యుండగు దుర్యోధనునకుఁదోడుగా నరుగవలసి వచ్చునేమో యనియు, నుభయులు దనకుఁ గావలసిన వారగుటవలన నెవ్వరిపక్షము నవలంబింపఁ గూడదనియుఁ దలంచి, బలరాముండు తీర్థయాత్రా నెపంబున ద్వారకానగరంబును విడిచి

పుణ్యతీర్థంబుల సేవింప నరిగెను. అట్లరుగుచు నెడనెడ ననేక పుణ్యతీర్థంబుల యందవగాహన మొనర్చుచు దేవర్షి పితృ తర్పణ బ్రాహ్మణ సంతర్పణంబుల నాచరించుచుఁ దుదకు నైమిశారణ్యంబును జొచ్చెను. అప్పుడచ్చటనున్న మునులందఱును దమతమ యాసనంబులనుండి డిగ్గి పూజించియుండ, సూతుండు మాత్రము నిజాసనంబునుండి లేవక, ప్రత్యుత్థాననమస్కార విధుల నడపక యుండుటవలన బలభద్రుం డతనియెడఁ గినుక వహించి, సూతుని దురాభిమానియనియు, విద్యాగర్వంబున నొడలెఱుంగక యున్నవాఁడనియు నెదభావించి, దుష్టజన శిక్షణార్థం బవతరించిన తనయట్టివాని కాతనియెడ నుపేక్ష సేయుట పాడికాదని హస్తంబుననున్న కుశాగ్రంబునే యాయుధంబుగాఁగొని యాతనివధించెను. అప్పుడచ్చట నున్న మునులందఱును హాహారవంబులతోడ నాతనిఁజూచి 'మహాత్మా! మేమీతనికి బ్రహ్మాసన మిచ్చియుండుటవలన నీరాక నెఱిఁగియు నాసనంబునుండి దిగుట యధర్మంబు గావున నటు సేయకుండె. సర్వజ్ఞుండవగు నీవును యుక్తాయుక్తంబుల విచారింపక యీతనిని వధించి బ్రహ్మహత్యాదురితంబు నందితివి. కావునఁ బ్రాయశ్చిత్తంబుఁ గైకొనుము. నీవే ధర్మంబుదప్పిన నింక భూమిపై ధర్మమునకుఁ దావుండునా?' యని యనేకవిధములఁబలుక బలరాముండును దామసంబునఁ దానొనర్చినపని

బలరాముఁడు సూతునిఁ జంపి తిరిగి బ్రతికించుట.

కిఁ జింతించి, యైననేమాయెనని తన యోగమాయా ప్రభావంబువలనఁ దిరిగి సూతునిఁ బునర్జీవితునిఁగా నొనర్చెను. మునులందఱు నాతఁడొనర్చిన పనికి సంతోషించి యతని పాపంబు దొలంగెనని వచించిరి. అట్టిమేలుఁదనకుఁ గూర్చినందులకు మునులయెడ నాతండు గరుణవహించి "మునులారా! నన్ను బ్రహ్మహత్యాదోషంబునుండి విముక్తునిఁగాఁ జేసి కాపాడితిరి. ఇట్టిమేలుఁగూర్చిన మీకు నేనును మేలు సేయనున్నాఁడ. ఏమివలయునో తెల్పుఁ" డనిపలుక వారంద

బలరాముడు పల్వలుండను రక్కసుని సంహరించుట.

ఱేకగ్రీవముగా "మహాత్మా! ఇల్వలునిపుత్రుండగు పల్వలుండను రక్కసజేడు మాసవనవాటికలను బాడుసేయుచు మమ్మనేకవిధముల బాధించుచున్నవాఁడు. వానిఁబట్టి వధించి మాకు మేలొనఁగూర్పు' మని, యాతనితో విన్నవించిరి. బలదేవుండును దనకు దుష్టశిక్షణం బవస్యకర్తవ్యంబు గావున స్మృతిమాత్రంబున నిజాయుధంబులఁ బడసినవాఁడై తత్ప్రాంతారణ్యంబుననున్న పల్వలునిగుహాకరిగి వానినెదిర్చి వినోదార్థంబుగాఁ గొంతకాలము రణమొనర్చి, తుదకుఁ దనహలాయుధంబున నాతనిని రెండుగాఁజీల్చివైచి మునిగణంబుల సంతోషపెట్టినవాఁడై తాను యథేచ్ఛంజనియెను.

కురుక్షేత్రంబునఁ గురుపాండవబలంబులు యుద్ధంబునకు సన్నద్ధంబులైయుండెను. కృష్ణుండుయుద్ధంబున జోక్యంబు

గలిగించుకొనక పార్థునకు సారథ్యంబుమాత్రంబు నెఱపుట కంగీకరించి పాండవ పక్షంబు నవలంబించెను. యుద్ధము ప్రారంభమయ్యెను. కురుబలంబులకు భీష్ముండు నాయకత్వము వహించెను. పాండవబలంబులకు ధృష్టద్యుమ్నుం డాధిపత్యమును గైకొనెను. అట్టియెడ యుద్ధము ప్రారంభమైన దని యనుటయేగాని యర్జునుఁడు మాత్రము, తాను రాజ్యభోగానుభవంబునకై, చిన్ననాటనుండి తన్నుఁ బెంచి పెద్దవానిఁగాఁ జేసిన భీష్ముని, విద్యాబుద్ధులఁ గఱపి తన్నంతవానిఁగా నొనర్చిన ద్రోణుని, మఱియుఁ దనకుఁ గావలసిన స్వబంధులను, గరుణావిహీనుఁడై, చంపఁ జాలనని కృష్ణునకుఁ దెలియఁ జేయుచు, విరక్తిభావమును వహించి విల్లునమ్ములను విడచి

శ్రీకృష్ణుఁడు పార్థునకు భగవద్గీతోపదేశంబు నొనర్చుట.

చింతానిమగ్నుఁడయ్యెను. అప్పుడు సకల విషయ రహస్యవేత్తయగు శ్రీకృష్ణుం డాతనిఁ జూచి 'పార్థా! శోకమోహములకిది యదను గాదు. నీవు క్షత్రియుండవు. క్షత్రియులకు ధర్మశాస్త్రోక్తమైన యుద్ధంబుకన్న నితరమగు ధర్మమేదియును లేదు. అట్టియెడ నీవు కులధర్మము నెంతమాత్రము నతిక్రమింపఁ గూడదు. కావున నీకన్నివిధముల యుద్ధమొనర్చుటయే ధర్మమగుచున్నది. వెండియు రాజులకు యుద్ధమే స్వర్గసమానము. అట్టియుద్ధమును నేరాజులు పొందుచున్నారో

యట్టివారు స్వర్గసుఖ భోగానుభవులగుచున్నారు. అర్జునా! ధర్మతత్వంబును దెలిపెద వినుము. ఎప్పటికైనను దేహములు నశించును గాని వానియందుండునట్టి యాత్మ నశింపనేరదు. ఈయాత్మను 'నేను జంపుచున్నా' నని తలంచువాఁడును, 'నావలనఁ జంపఁబడు' నని భావించువాఁడును, కేవలమజ్ఞానుఁడగుచున్నాఁడు. అన్నింటి యందును సద్రూపముగా నుండునట్టి యీయాత్మకు, నాశము నొందుట, మాఱురూపమును బొందుట, పుట్టుట, పెరుగుట, క్షీణించుట యనునవి యొంతమాత్రమును లేవు. ఎల్లప్పుడీయాత్మ యొకే స్వరూపమున నిలచియుండును. పంచభూతంబులీయాత్మకు బాధింపఁజాలవు. ఆత్మ నిత్యుండు—అవ్యయుండు—వికార రహితుండు— శుద్ధుండు— ఒక్కండు— వాగగోచరుండు — అచ్యుతుండు. కావుననే పాంచభౌతికంబులగు దేహంబులు నశించుచున్నను, నీయాత్మ నశించుటలేదు. స్థిరుండగుటవలననే, యొక దేహమును విడిచి మఱియొక దేహమును బ్రవేశింపఁగలుగుచున్నాఁడు. పార్థా. ఒకఁడొకని చేత నింకొకనిఁ జంపించుచున్నాఁడనియు, నొకఁడు మఱియొకనిఁ జంపుచున్నాఁడనియుఁ జెప్పుట కెంతమాత్రమును వీలులేదు. చంపుటకును జంపించుటకును దేహి స్వతంత్రుఁడు గానేరఁడు. నా మూలమున భీష్మాదులందఱును జంపఁబడుచున్నారుగదా!

యని నీవెంతమాత్రమును జింతింపవలదు. చంపువాఁడవును, జంపించువాఁడవును నీవుగానేరవు. నీవు కేవలము నిమిత్త మాత్రుఁడవు. కావున యుద్ధమునకుఁ గడంగుము. ఇదిగో! సర్వమును దిలకింపు మని తత్త్వోపదేశానంతరము దివ్య దృష్టినొసంగెను. అర్జునుండు దివ్యదృష్టితోఁ దిలకించి నంతనే, కురుబలంబంతయు యమభటులమూలంబునఁ బ్రాణంబులఁగోలుపోవుచుండెను. అంతఁ బార్థుండు సర్వమును గ్రహించినవాఁడై, యుద్ధమునకుఁ గడంగెను.

కురుక్షేత్రసంగ్రామము.

కురుక్షేత్ర సంగ్రామంబు షుమారు పదునెని మిది దినములవఱకు జరిగెను. యుద్ధము సమాప్తినొందునప్పటికిఁ గురువంశంబంతయును, పాండవుల బలంబు లన్నియును నశించెను. తుదకుఁ బాండవులు మాత్రము మిగిలిరి. అట్టియెడ ద్రోణుని పుత్రుండగు నశ్వత్థామ కౌరవబలంబులోని వాఁడగుటవలనఁ దనతండ్రి చావునకును, దుర్యోధనాది కౌరవ వినాశంబునకును మిగుల దుఃఖించి పాండవులయెడఁ గినుకవహించినవాఁడై "అపాండవ మగుఁగాక" యని నారాయణాస్త్రమును బ్రయోగించెను. ఆయస్త్రజ్వాలలవలనను త్తర గర్భంబులోని పిండముగూడ మృతినొందెను. అప్పుడు కృష్ణుండా యస్త్రంబు బారినుండి పాండవుల రక్షించి యుత్తర గర్భస్థమగు పిండమునకుఁ బ్రాణ

శ్రీకృష్ణుఁడుత్తర గర్భంబునకుఁ బ్రాణ దానమొసఁగుట.

దానంబొసంగెను. ఇట్లు పాండవుల రక్షించి యుద్ధానంతరము ధర్మరాజునకుఁ బట్టాభిషేక మొనర్చెను. ధర్మజుండును ధర్మంబు దప్పక రాజ్యపరిపాలనంబు సేయఁదొడంగెను. కృష్ణుండు వారికిఁ దోడుగానుండెను.



# ఉపసంహారము.



ధర్మరాజు ధర్మంబును దప్పక రాజ్య పరిపాలనం బొనర్చుచుండ హస్తినాపురంబునఁగల యొకబ్రాహ్మణునకుఁ బుట్టినవారు పుట్టినట్లే కుమారులందఱును గతించుచుండిరి. ఆబ్రాహ్మణుండును బుత్రశోకంబును భరింపఁజాలక రాజ మందిరంబును దరియంజని 'ఓధర్మరాజా! నీపరిపాలనంబున నధర్మంబు నిలచియుండుటఁజేసి నాపుత్రులందఱును మరణించుచున్నారు. ఇట్టి యధర్మయుక్తంబైన నీపరిపాలనంబేల కాల్పనా?' యని యనేకవిధంబుల వాపోవఁదొడంగెను. అట్టి యెడ నర్జునుం డాతనికడ కరిగి వృత్తాంతంబంతయు నాతనివలన నెఱింగి యా విప్రకుమారులఁ దాఁ దెత్తుననియు నింక ముందుగలుగు పాపలను మృత్యువాతఁ బడకుండ రక్షింతుననియు, నట్లొనర్పకున్న ననలంబునఁబడి కాయంబు దొఱంగువాఁడనియుఁ బ్రతిజ్ఞపట్టి యాతనికి దుఃఖోపశమనంబు గావించెను. ఇట్లుండఁ గొన్నినాళ్ళ కావిప్రుని భార్యకు నీళ్ళాడు ప్రొద్దులురాఁగా, నర్జునుం డెఱింగి, సూతికామందిరంబుచుట్టును బాణంబులఁ బ్రయోగించి తుదకుఁ జీమగూడఁ బ్రవేశింపఁజాలనట్లొనర్చి తానప్రమత్తుఁడైయుండెను. కాని పుట్టిన శిశువు పుట్టినట్లే

అర్జునుడు విప్రకుమారులఁ దెత్తునని ప్రతిజ్ఞ పట్టుట.

చనిపోవ విప్రుం డర్జునుని నిరర్థకప్రతిజ్ఞను గలవానింగా దల
పోసి మురహరునికడ కరిగి పుత్రరక్షణ మొనర్పవలసినదని యా
మహానీయు ననేకవిధంబులఁ బ్రార్థించెను. ఇచ్చోట నర్జునుం
డును బ్రతిజ్ఞాభంగమునకు విచారించుచు నస్త్రబలంబువలన
యమసదనంబున కరిగి యచ్చోట విప్రకుమారులఁ గానక
యెల్లచోట్లను వెదకినవాఁడై తుదకుఁ దానాడిన మాటను
నిలుపుకొనఁజాలక, యగ్నిఁ బ్రవేశింపనుండెను. అట్టియెడఁ
గృష్ణుండు విప్రునితోఁ గలసి యర్జునుని చెంత కరుగుదెంచి,
యతనికిఁ దాను విప్రకుమారులను జూపెదననియు నగ్ని
యందుఁ బడవలదనియుఁ దెలియఁ బలికి విప్రునకు ధైర్యంబు

శ్రీకృష్ణుఁడు విప్రకుమారులఁదెచ్చి యర్జునుని ప్రతిజ్ఞను నిల్పుట.

సెప్పి యప్పుడే యర్జునునితో శ్రీకృష్ణుఁడు విప్ర
కుమారాన్వేషణార్థమై యరిగెను. కృష్ణుండు
సర్వజ్ఞుఁడుగావున దుర్గవనజానపదాచలపక్కణ
ప్రభూతనదనదీసరోవరయుతక్షితినంతయుదాటి, సప్తసము
ద్రంబులను, గులగిరిప్రకరంబును నుత్తరించి మేరునగంబు నతి
క్రమించి, యలోకంబును, భూరినీరంధ్రనిబిడాంధకారప్రయు
క్తంబునునగు ప్రదేశంబును జొచ్చి, నిజచక్రాయుధప్రకాశం
బువలన మార్గంబును గాంచుచుఁ జనిచని పెంజీకటి కివ్వల
సకలమునిగణసమేతుండై భోగీంద్రభోగతల్పంబున శయనించి
యున్న యాది విష్ణుమూర్తిని సందర్శించి, యనేక విధంబులఁ
బ్రార్థించెను. అంత నయ్యాదిదేవుండును గృష్ణార్జునులంగని,

"మహాత్ములారా! మీరు నాయంశమున ధర్మ సంస్థాపనార్థమై నరనారాయణులన జనించియున్న వారగుటవల, నట్టి మిమ్మును జూడవలయునని యీ మునీంద్రులు నన్నర్థింప విప్రకుమార నెపంబున మిమ్మిచ్చటికి రప్పించితిని. నీచెలికాఁడగు నరుని ప్రతిజ్ఞవ్యర్థ కాఁగూడదు. కావున నీవిప్రకుమారులఁ దోడ్కొనిపొమ్ము. శుభంబయ్యెడు' నని పలికి, విప్రకుమారుల నొసంగఁ గృష్ణార్జునులు సముదిత స్వాంతులై, యయ్యాదిదేవుని కృపావిశేషంబునకు మెచ్చుకొనుచు నటనుండి బయలుదేరి దీర్ఘప్రయాణంబుల నొనర్చి, హస్తినాపురంబును ప్రవేశించి యావిప్రునకు మృతులైన యాతనికుమారుల నందఱ నొసంగిరి. కృష్ణుండును దనమిత్రునకుఁ బ్రతిజ్ఞాభంగంబుగాకుండ నివ్విధంబునఁ గాపాడినవాఁడై పాండవుల వీడుకోలును వడసి ద్వారకానగరంబున కరిగెను.

శ్రీకృష్ణుండు ద్వారకానగరంబును బ్రవేశించిన కొన్నినాళ్లకు యదువంశక్షయంబునకుఁ దుర్నిమిత్తంబులు గోచరంబులుగాఁజొచ్చెను. నారదాది మహామునీంద్రు లందఱును శ్రీకృష్ణుని నవతారంబు చాలించి వైకుంఠమునకు రమ్మని ప్రార్థింపఁదొడంగిరి. అట్టియెడ నొకనాఁడు కొందఱు మునీంద్రులు శ్రీకృష్ణ సందర్శనంబొనర్చి ద్వారకానగర రాజమార్గంబున నరుగుచుండ యాదవులు గొందఱొక్కచో గుంపుగట్టి,

తమలో నొక్కనికి స్త్రీవేషంబునమర్చి, యరుగుచున్న మునులఁ గాంచి 'మహాత్ములారా! ఈకాంత కేమికలుగునో వచింపుఁ' డని యపహాస్యంబుగాఁ బలుక వారును దివ్యదృష్టివలన సర్వంబు నెఱింగి వారియెడఁ గినుకవహించి, యాకాంతకొక ముసలంబు పుట్టునదియు, దానివలన యదువంశ క్షయమగు ననియు వచించి వెడలిపోయిరి. మునులవచన ప్రకారము గొన్నినాళ్లకు స్త్రీవేషధారియగు నాపురుషునకు ముసలంబు పుట్ట యాదవులు భయమంది యాముసలంబునంతయు నఱగఁ దీసి సముద్రంబునఁ గలిపిరి. కాని తద్గంధలిప్తంబులగు తరంగంబులు పుడమిఁదాకుటవలన సముద్రతీరంబున నది యంతయుఁ దుంగగా నంకురించి నానాటికభివృద్ధినొందెను. ఇట్లుండ యాదవులందఱొకనాఁడు మదిరాపానమత్తులై సముద్రతీరంబును జేరి యకారణంబుగ నంతఃకలహంబును బెంచికొని, యచ్చట దట్టముగాఁ బెరిగియున్న తుంగ బాటికలతో నొకరినొకరు మోదుకొనుచు, ఘోరంబుగఁ బోరుసల్పితుదకందఱును బ్రాణంబులు వాసిరి. మునులవచనంబులివ్విధంబున సార్థకంబులయ్యెను.

యదువంశక్షయము.

ఇట్లు యాదవులందఱును మడిసిన యనంతరము బలరాముండు తనయవతారంబు సమాప్తినొందెనని యెఱింగి శ్రీకృష్ణుని యనుమతిని ద్వారకాపురంబును నిర్గమించి చని

బలరాముండవతారంబును చాలించుట.

చని యోగమార్గంబున దేహంబును చాలించి యనంతునిఁగలసెను. అప్పుడు వైకుంఠంబునఁ గలవారందఱును మిగుల సంతోషంబు నంది శ్రీకృష్ణునిరాకకై ప్రార్థింపఁ దొడంగిరి. జగదభిరాముండగు రాముండివ్విధంబునఁ దనయవతారంబును చాలించి యదువంశ చారిత్రపత్రంబులనుండి విడివడిపోయెను.

యాదవులు నశించుటయు, బలరాముండవతారంబును చాలించుటయు, నారదాది మునీంద్రులు వైకుంఠంబునఁదనకై వేచియుండుటయుఁ దనయవతారంబు సమాప్తియగుకాలంబు సమీపించియుండుటయుఁ దెలిసికొని శ్రీకృష్ణుండుద్ధవునిఁ జేరం బిలిచి " ఉద్ధవా! బ్రహ్మాదిదేవతా ప్రార్థనంబునఁజేసి యిట్లవతారంబునుదాల్చి ధాత్రీభారంబును దొలంగించితిని. నేటితో నాయవతారంబు సమాప్తినొందఁగలదు. నేటికి సప్తమదివసంబున సముద్రుండు ద్వారకాపురంబును ముంపఁగలఁడు. కావున నీలోపలనే యందున్న స్త్రీవృద్ధ బాలాదులను హస్తిపురికిఁ జేర్పవలసినదని నాయాజ్ఞఁగాఁ బార్థునకుఁ దెల్పుము. ఇంతటినుండి, కలియుగంబు సంప్రాప్తంబుఁగాఁగలదు. అట్టి కలియుగంబున మానవులందఱును దుష్ప్రవర్తనములఁదగిలి, యధర్మపరులై యకాల మరణంబులకులోనగుచుందురు. అధర్మంబు

శ్రీకృష్ణుఁడుద్ధవునకుఁబర మార్గంబునుపదేశించుట.

మూడుపాళ్లు నడచుచుండును. మఱియు మానవులందఱును ధర్మవిరహితులు, నాచారవిహీనులు, నన్యాయపరులు, నతి రోషులు, మందమతులు, నల్పతరాయువులు, బహురోగ పీడి తులు, నిష్ఫలారంభులు, నాస్తికులునై యొండొరులమెచ్చక యుందురు. కావున నీవు సుహృద్బాంధవ స్నేహంబు వర్జించి యింద్రియవికారంబులకు లోనుగాక, యెల్లప్పుడు హరినామ స్మరణంబొనర్చుచు జన్మరాహిత్యంబు నొందుము. ఇంకను వినుము. మానవులు గృహస్థులై యున్నను, రాగాది విషయంబులందుఁ దమచిత్తంబులఁజొప్పింపక, సంసారంబున నుండియు, సంసారబంధంబులకు దూరస్థులగుచు నిరంతర ధ్యానగరిష్ఠులై యగ్రాహ్యుండనగునన్ను సత్వగుణగ్రాహ్యు నిఁగా నెఱింగి, హృత్పద్మంబుల జీవాత్మ పరమాత్మల భిన్నం బుగాఁ దలంపక, యేకంబుగాఁబరిగణించి, శంఖచక్ర గదా ఖడ్గ శార్ఙ్గ కౌమోదకీ కౌస్తుభాభరణయుక్తుండనగు నన్నే సర్వంబునకు మూలంబని భజించిరేని జన్మరాహిత్యంబు నొందఁగలరు. నీవింక నేగుము. నేటితో నేనీయవతారంబును చాలించి వైకుంఠంబున కరిగెద' నని తెలియఁబలికి పరమా ర్థజ్ఞానోపదేశంబు నొనర్చిన నుద్ధవుండును సంతోష దుఃఖం బులు హృదయంబున మల్లడిఁగొన మాఱుమాట వలుక నేరక శ్రీకృష్ణుని యాజ్ఞను శిరసావహించి వెడలిపోయెను.

ఉద్ధవుండరిగిన యనంతరము శ్రీకృష్ణుండును, నిజపు రంబును విడనాడి యొందేనిఁ జని యొక్కనికుంజపుంజంబు చాటున విశ్రమించి చరణంబు వేఱొక చరణంబుమీఁద నిలిపి వినోదంబు సలుపుచుండెను అట్టియెడ మృగయుఁ డొక్క గుండా ప్రదేశంబునకుఁ జనుదెంచి, వినోదంబుగా నటునిటుఁ గదలి యాడుచున్న శ్రీహరి చరణంబును హరిణకర్ణంబుగా, హృదయంబున భావించి బాణప్రయోగ మొనర్చెను. ఆవ్రేటునకుఁ గృష్ణుండు హాహారవంబొనర్ప మృగయుండును దదారవంబు నాలించి మానవునిఁగా దలపోసి, యప్పరమేశ్వరుని డాయంజని తా నొనర్చిన యపరాధంబునకుఁ జింతించుచు నామహాత్ము ననేకవిధంబుల క్షమాపణంబును వేఁడి, యామహనీయుఁడు దన్ను క్షమించినను దృప్తినొందక వైష్ణవాపరాధంబునకు క్షమాపణంబు లేదను భావంబున శ్రీహరిం దలంచుచుఁ బ్రాణంబులఁ బాసి యపవర్గ ప్రాప్తినొందెను. అంతఁ

శ్రీకృష్ణావతార పరిసమాప్తము.

కృష్ణుఁడును దనకై విలపించుచున్న దారుకునిఁ గనుంగొని, తాను దేహంబు చాలించిన వృత్తాంతమును బాండవాక్రూర సాత్యకి ప్రముఖులకందఱికిఁ దెలియఁజేయుమని పలికినవాఁడై యోగమార్గంబున దేహంబును జాలించెను. అట్టియెడ నభోభాగంబున జయశబ్దంబు లొక్కపెట్టునఁ జెలరేగెను. శతకోటి సూర్య

దివ్య తేజోవిభాసితంబగు విమానంబెక్కి సనుదేరఁ గృష్ణుండును, బ్రహ్మరుద్రేంద్రాది దేవతలందఱును దన్నుఁ గీర్తించుచుండఁ గదలి వైకుంఠంబున కరిగెను. పుడమియంతయుఁ బూలవానలతో నిండిపోయెను. చల్లనిమలయపవనంబులతోఁ బ్రకృతియంతయు హృదయానందకరంబుగ నుండెను. విశ్వము విశ్వరూపునిలో లీనమయ్యెను.

సంపూర్ణము.





# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA117B182 |
| పుస్తకం పేరు | యదువంశము |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 119 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | SOWMYA |
| పేజీలు విడదీసినది | SOWMYA |
| స్కాన్ చేసినది | Hema |
| పరీక్ష చేసినది | DAVEED |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |